# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



కేవలం విక్స్ వేపోరబ్ మాత్రమే జలుబు బాధిత ప్రాంతాలు మూడింటి మీద వెంటనే పనిచేస్తుంది ...

# రాత్రికిరాత్రే జలుబును తొలగిస్తుంది




విక్స్ వేపోరబ్ తక్షణమే మీకు ఉపశమనాన్ని కలిగిస్తుంది. సులభంగా శ్వాస పీల్చుకొనుటకు...రాత్రంతా హాయిగా నిద్రపోవుటకు మీకు సహాయపడుతుంది....

గొంతునొప్పి, ముక్కునుండి నీరు కారుట, ఛాతీ బిగలాగుట, క్రమతో శ్వాసపీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనపడగానే జలుబు బాధిత ప్రాంతాల మూడింటి మీద...ముక్కు, గొంతూ, ఛాతీల మీద విక్స్ వేపోరబ్‌ను పులమండి. కొద్ది నిముషాలలోనే విక్స్ వేపోరబ్ మీ చర్మాన్ని వెచ్చచేయడం...మీకు ఉపశమనాన్ని కలిగించడం మీరు గమనిస్తారు. నివారణగలిగించే వేపోరబ్ ఆవిరితెరలు ముక్కు మరియు ఛాతీలలోని కఫాన్ని త్వరగా విడలగొట్టి మీ గొంతునొప్పిని తగ్గిస్తాయి.

విక్స్ వేపోరబ్ జలుబుతో రెండు విధాలుగా పోరాడుతుంది. రాత్రంతా మీరు సుఖంగా నిద్రించే సమయంలో యీ అద్భుతమైన ద్వివిధ చర్య కొనసాగుతూ ఉంటుంది. ఉదయానికల్లా మీ అతి పెద్ద జలుబు కూడా పూర్తిగా పోయి మీరు సంతోషంగాను, ఆరోగ్యంగాను వుంటారు.

నిద్రపోయే సమయంలో విక్స్ వేపోరబ్‌ను జలుబు బాధిత ప్రాంతాల మీద పులమండి...

| ముక్కు మీదా, మరియు ప్రక్కలందు | గొంతు మరియు ఛాతీ మీద | వీపు మీద |
| --- | --- | --- |

## విక్స్ వేపోరబ్ యొక్క అద్భుతమైన ద్వివిధ చర్య



వెలుపలి చర్య: చర్మమును వేడిపరచే వేపోరబ్ యొక్క చర్య మీకు తక్షణమే ఉపశమనమును గలిగించును. వేపోరబ్ యొక్క గుణకరమైన ఔషధములు చర్మము మీద పనిచేసి బిగలాగిన ఛాతీ మరియు వీపును సడలించును. కండరముల నొప్పిని తొలగించును.



లోపలి చర్య: మీ శరీరపు వేడే వేపోరబ్‌ను త్వరగా ఔషధపు ఆవిరి తెరలుగా మార్చును. ఈ ఆవిరి తెరలను ప్రతి శ్వాసతో రాత్రి పొడవునా మీరు లోపలికి పీలుస్తారు. యీ లోపలి చర్య ముక్కులోనూ ఛాతీలోనూ వున్న కఫమును తొలగించును...గొంతునొప్పిని ఉపశమింప చేయును.

తీవ్రమైన జలుబులకు, ఆవిరినుండి లేచి వచ్చే విక్స్ వేపోరబ్ ఔషధపు ఆవిరి తెరలను పీల్చండి

# విక్స్ వేపోరబ్




3 సైజులలో

VV 364

సినిమా
తారలు
మెచ్చిన








# రెమి
## పౌడర్



ఎక్కువగా
స్కూళ్లన్నీ దీన్నే
నిర్దేశిస్తున్నాయి
యూనిఫారములకు

అందంగా ఉండి, రంగు దిగని బిన్నీవారి కేస్‌మెంట్ B 5586! అమోఘమైన మన్నిక వల్ల స్కూలు యూనిఫారములు - ట్యూనిక్‌లు, స్కర్ట్‌లు, షర్టులు, బ్లౌజులు, షార్టులు అన్నిటికీ అందరూ వాడతారు.

ఇంట వాడకానికి కూడా B 5586 ఆకర్షణీయమైన కర్టెనులు, కుషన్ కవరులు ఇంకా ఇతర ఉపయోగాలకు కూడా అనుకూలంగా ఉంటుంది.

B5586 అనేక రంగుల శ్రేణిలో లభిస్తుంది.

# బిన్నీవారి
# కేస్‌మెంట్
# B.5586



ది బెంగుళూరు వుల్లెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు, బెంగుళూరు-23 బిన్నీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసువారి అంగ సంస్థ.



# ప్రశ్నోత్తరాలు

1. యస్. రమణరాజు, నంద్యాల

"దుర్గేశనందిని" పూర్తిచేసి "నవాబునందిని" కూడా ప్రచురించెదరా?

అదే ఉద్దేశం.

2. జి. వి. శ్రీధర్, మద్రాసు

బేతాళ కథలు మీరు ప్రచురించే రీతినే రచయితలు పంపిస్తారా? లేక ఆ శీర్షికకు పంపిన కథలను మీరే బేతాళ కథలుగా రూపొందించుకుంటారా?

ఒక్కొక్కప్పుడు పాఠకులు బేతాళ కథలుగా ఉద్దేశించే పంపుతారు. ఒక్కొక్కప్పుడు మామూలు కథలుగా పంపిన వాటిని బేతాళ కథలుగా మార్చటం కూడా జరుగుతుంది.

3. బందరు మోహనాంగరావు, కవిటి

"చందమామ"లో ప్రకటించుచున్న రామాయణము ప్రత్యేక పుస్తకముగా అచ్చు వేయుచున్నారా?

ప్రస్తుతం లేదు.

4. గొనప దాసప్ప, సిలగాం

నేను వినాయకచవితి రోజున మీ "చందమామ" ముఖము చూచాను. ఏమి అప నిందలు రావు గద.

మా "చందమామ" ఏనాడూ చవితి చంద్రుడు కాడు—ఎప్పుడూ పూర్ణచంద్రుడే. అందుచేత అపనిందల భయంలేదు.

5. మండవ రామమోహన్‌రావు, విజయవాడ

"యుద్ధకాండ"లో "ఏనుగు లంతేసి కొండరాళ్ళను యంత్ర సహాయంతో చేర్చారు" అని వ్రాసినారు. త్రేతాయుగంలో కూడా యంత్రములు ఉన్నవేమో తెలియపర్చగలరా?

రాముడి కాలంలో రాళ్ళను చేరవేసే యంత్రాలున్నాయనే రామాయణ కర్త నమ్మకం. కాదన టానికి మనకేం హక్కున్నది?

6. సి. హెచ్. శ్రీరామారావు, బాపట్ల

పరోపకారి పాపన్న కథలు బాగున్నవి. అవి వేరే ఎవరైనా వ్రాయుచున్నారా? లేక మేము వ్రాసి పంపవచ్చా?

ఎవరైనా పంపవచ్చు. బాగుంటే వేస్తాము.

• కరకరలాడేవి

• రుచికరమైనవి

• పుష్టిని కలిగించేవి






సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి., పూనా-2

heros' SBC-229 TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

దేశంలో ఉండిన ఉద్రిక్త పరిస్థితి కారణంగా కిందటి దీపావళికి ప్రత్యేక సంచిక వెయ్యలేక పోయాము. ఈ సంవత్సరం ఎప్పటిలాగే దీపావళి ప్రత్యేక సంచిక వెలువడుతున్నది. రానున్న నవంబరు "చందమామ" సంచికే దీపావళి ప్రత్యేక సంచిక. ఎక్కువ పేజీలతో, అదనపు రంగుల బొమ్మల కథతో, విశేషమైన అట్టమీది బొమ్మల ఆకర్షణతో ఈ సంచిక పాఠకులకు ఆనందం చేకూర్చ గలదని ఆశిస్తాము.

సంపుటి 35 అక్టోబర్ 1964 సంచిక 4





# భారత చరిత్ర




భారతదేశానికి మొగలులు రాక పూర్వం అఫ్ఘాను తురుష్కుల పాలనలో ఉండిన ఢిల్లీ సల్తనతు క్షీణదశకు రావటమూ, అందువల్ల భారతదేశ మంతటా వేరువేరు స్వతంత్ర రాజ్యా లేర్పడటమూ, ఆ రాజ్యాల మధ్య సాగిన కలహాలూ మొదలైన విష యాలు లోగడ తెలుసుకున్నాం.

1526 కు పూర్వం మొగలులు ఉత్తర భారతంపై చేసిన దాడులు విఫలమయాయి. తీమూర్ ఢిల్లీ సామ్రాజ్యం పై దాడి చేసి పంజాబును వశపరచుకోవటం వల్ల అఫ్ఘాన్ సామ్రాజ్యం మరింత బలహీన మయిందే గాని, మొగలుల పరిపాలనకు పునాది ఏర్పడ లేదు. అలాటి పునాది ఏర్పరచిన వాడు బాబరు. అటు తరవాత కూడా 30 ఏళ్ళ పాటు అఫ్ఘానులకూ, మొగలాయీలకూ ఘర్షణ సాగి, చివరకు అక్బరు హయాంలో మొగలుల ఆధిపత్యం సుస్థిరమయింది.

బాబరు తండ్రి తీమూర్ వంశానికి చెందిన వాడు. తల్లి ఛింగిజ్ ఖాన్ వంశానికి చెంది నది. అతను 1483 లో పుట్టాడు. అతను 11 ఏళ్ళవాడై ఉండగా తండ్రి నుంచి ఫర్ఘాన (ఇప్పుడు చీనా తుర్కిస్తానులో ఒక భాగం)ను జాగీరుగా పొందాడు. అయితే అతను చిన్నతనంలో అనేక కష్టాలు పడి రాటు తేలాడు. తీమూర్‌కు రాజధానిగా ఉండిన సమర్కండును జయించాలని ఇతను 1497 లోనూ, 1503 లోనూ చేసిన ప్రయత్నాలు విఫలమయాయి. దీనికి తోడు ఫర్ఘాన కూడా పోయింది. అతను ఒక ఏడాదిపాటు తల దాచుకునే చోటు లేక సంచార జీవితం గడిపాడు.

కాని ఈ దుస్థితిలో కూడా అతనికి భారత దేశాన్ని జయించే కోరిక కలిగింది. అతను ఒక గ్రామాధికారి ఇంట తల దాచుకున్న సమయంలో, ఆ గ్రామాధికారి తల్లి, నూట

## 37. మొగలాయి సామ్రాజ్యం : బాబరు

పదకొండేళ్ళ వృద్ధు, అతనికి తీమూర్ దాడు లను గురించి కథలు చెప్పింది. దానితో అతనికి కూడా తన పూర్వీకుడి లాగా భారత దేశం పై దండెత్తా లనిపించింది.

ఇందుకు మొదటి మెట్టుగా అతను 1504 లో కాబూలును ఆక్రమించాడు; ఉజ్బెగ్‌ల రాజ్యంలో తిరుగుబాట్లు అతనికి ఈ పని చెయ్యటానికి ఉపకరించాయి. సమర్కండ్ ను ఆక్రమించటానికి అతను చేసిన మరొక యత్నం 1512 లో విఫల మయింది. వాయువ్య దిశ తనకు అచ్చి రాదని రూఢి చేసుకుని బాబరు ఆగ్నేయ దిశకు తన దృష్టి మరల్చాడు. భారతదేశపు నడి బొడ్డు చేరుకునే అవకాశం అతనికి దొరకటానికి మరి 12 ఏళ్ళు పట్టింది. ఢిల్లీ సామ్రాజ్య శిథిలావస్థలో తమలో తాము కొట్లాడుకుంటున్న రాజులలో కొందరు బాబరును రమ్మని ఆహ్వానించారు.

ఈ ఆహ్వానాన్ని అందుకుని బాబరు 1524 లో పంజాబుకు వచ్చి, లాహోరు ఆక్రమించాడు. అతను తమకు సహాయం రాలేదనీ, హిందూస్తానాన్ని జయించ వచ్చా డనీ అతన్ని ఆహ్వానించిన వారికి తెలిసి పోయి, వా రతనిపై ఎదురు తిరిగారు. అతను కాబూలుకు తిరిగి పోవలిసివచ్చింది.



బాబరు పెద్ద సేనను అయత్తం చేసుకుని 1525 నవంబరులో పంజాబును ఆక్ర మించి, దానికి రాజైన దౌలత్ ఖాన్ లోడీని లోబరచుకున్నాడు. అక్కడి నుంచి అతను ఢిల్లీలో నామ మాత్రపు సుల్తానుగా ఉన్న ఇబ్రాహీమ్ లోడి పైకి వెళ్ళి, 1526 ఏప్రిలు 21 న పానిపట్టు వద్ద అఫ్ఘాన్ బలాలతో యుద్ధం చేసి జయించాడు. లోడీ సుల్తానుకు యుద్ధ తంత్ర మేమీ తెలియని కారణం చేత 12 వేల బాబరు సైన్యం లక్షమంది శత్రు సైనికులను ఒక్క పూటలో మట్టు పెట్టింది. బాబరు వెంటనే ఢిల్లీ, ఆగ్రా నగరాలను వశపరచుకున్నాడు.

అప్పటికీ అతని విజయం పూర్తి కాలేదు. సంగరాణా ఆధిపత్యం కింద ఉన్న రాజ పుత్ర సమాఖ్య చాలా ప్రబలమైనది. మొగలు సైనికులు యుద్ధరంగంలో రాజ పుత్ర సేనలను చూసి వణికి పోయారు. బాబరుకు కూడా తాను గెలవనని భయం పట్టుకున్నది. అతను తన శిబిరంలో పాన పాత్రలను పగల గొట్టి, మద్య మంతా పార బోసి, తన సైనికులకు ఘాటైన ఉద్బోధలు చేసి, యుద్ధం చేస్తామని వారి చేత కురాను పై ప్రమాణాలు చేయించాడు.

1527 మార్చి 16న, ఆగ్రాకు పడమట ఖానువ (లేక కాన్వా) అనే గ్రామం వద్ద ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. రాజ పుత్రులోడిపోయారు. సంగరాణా కొద్దిమంది అనుచరులతో పారిపోయి మరి రెండేళ్ళ అనంతరం చనిపోయాడు.

బాబరు జీవితాంతం వరకూ అఫ్ఘానులతో పోరాటం సాగిస్తూనే వచ్చాడు. అతను చేసిన మూడవ ప్రముఖ యుద్ధం బిహారు బెంగాలు అఫ్ఘానులతో. 1529 మే 6 న గంగా తీరాన, పాట్నాకు ఎగువగా, గోగ్రా సంగమం వద్ద జరిగిన ఈ యుద్ధంలో కూడా అఫ్ఘానులు చిత్తుగా ఓడారు. బాబరు స్థాపించిన మొగలాయి సామ్రాజ్యం అప్పటికే ఓక్సస్ నుంచి గోగ్రా నది దాకానూ, హిమాలయాల నుంచి గ్వాలియరు దాకానూ విస్తరించింది. తరవాత కొద్ది రోజులకే, 1530 డిసెంబరు 26 న బాబరు ఆగ్రాలో మరణించాడు. అతని మరణం గురించి ఒక కథ చెబుతారు. అతని కొడుకు హుమాయూన్ జబ్బు పడ్డాడనీ, బాబరు ఆ జబ్బును తన కిచ్చి తన కొడుకును కాపాడమని దేవుణ్ణి ప్రార్థించాడనీ, దాని ఫలితంగా హుమాయూన్ కోలుకుని, రెండు మూడు నెలల అనంతరం బాబరు వ్యాధితో మరణించాడనీ చెబుతారు. బాబరును కాబూలు తీసుకుపోయి, ఖననం చేశారు.



# నెహ్రూ కథ

4



మోతీలాల్ ఇంటి వాతావరణంలో పర పరిపాలనా విద్వేషం ఉండేది. బ్రిటిషువారు భారతీయుల స్వాతంత్ర్యాన్ని హరించారు; అందుకు వారిని గర్హించాలి. ఈ భావం జవాహర్‌కు కూడా చిన్నతనం నుంచీ ఉండేది. అందు చేత 1899-1902 మధ్య బ్రిటిషువారికీ, బోయర్లకూ యుద్ధం జరిగి నప్పు డతనికి బోయర్ల పైన సానుభూతి ఉండేది. (బోయర్లు దక్షిణాఫ్రికాలో నివసించే డచ్చి వారి సంతతికి చెందిన వారు.) ఈ యుద్ధానికి సంబంధించిన వార్తల కోసం అతను మొట్ట మొదటి సారిగా పత్రికలు ఆత్రంగా చదవ నేర్చాడు.

అటు పిమ్మట 1904-1905 లో రష్యా, జపానుల మధ్య యుద్ధం జరిగింది. జవాహర్ ఈ యుద్ధం పట్ల ఇంకా హెచ్చు ఆసక్తి కనబరిచాడు. జపానువారు గెలిచి నట్టు వార్త వచ్చినప్పుడల్లా అతనికి మితి లేని ఆనందం కలిగేది. అందుకు కారణం జపాను ఆసియా దేశమూ, రష్యా యూరప్ దేశమూ కావటమే. ఆ యుద్ధంలో జపాను రష్యాను ఓడించటం ఆసియాకే గర్వకారణమని జవాహర్ భావించి ఉండాలి. ఆ ఉత్సాహంలో అతను జపానుకు సంబంధించిన పుస్తకాలు కొని చదివాడు. తాను కూడా జపాను యోధులలాగా కత్తి చేత బట్టి భారత స్వాతంత్ర్యం కొరకు ఘోరంగా పోరాడినట్టు కలలు కూడా కన్నాడు.

మోతీలాలుకు బ్రిటిషు విద్యాశాల లంటే మంచి గురి ఉండేది. జవాహర్‌ను ఏదైనా బ్రిటిషు పబ్లిక్ స్కూలులో చదివించాలని ఆయన తలపెట్టాడు. అదృష్టవశాన హారో స్కూలులో ఖాళీ దొరికింది. అప్పటికి జవాహర్ పదహారేళ్ళవాడు; పబ్లిక్ స్కూల్లో ప్రవేశించే ఈడు కొద్దిగా మించింది.



1905 మే నెలలో జవాహర్ ఓడ పైన ఇంగ్లండుకు బయలుదేరాడు. అతని వెంట అతని తండ్రీ, తల్లీ, నాలుగేళ్ళ చెల్లెలు సరూప్ బయలుదేరారు. (ఈ సరూప్ ఈనాడు బొంబాయి గవర్నరుగా ఉన్న విజయలక్ష్మి పండిట్.)

డోవర్‌లో ఓడ దిగి రైల్లో లండనుకు వచ్చే దారిలో జవాహర్ పత్రిక ఒకటి కొని, అందులో రష్యా జపాను చేతిలో ఓడి పోయిన వార్త చదివి తన్మయుడయాడు.

హారో విద్యాలయంలో చదివిన వారిలో కనీసం నలుగురు—పీల్, పామర్‌స్టన్, బాల్డ్విన్, చర్చిల్—బ్రిటిషు ప్రధాను లయారు. అక్కడే చదివిన తన కొడుకు తొలి భారత ప్రధాని కాబోతాడని తెలిస్తే మోతీలాల్ ఎంతగా సంతోషించేవాడో!

జవాహర్ హారోలో ప్రవేశించిన నాటికి అక్కడ విద్యార్థులుగా ఉన్న వారిలో బరోడా మహారాజు కొడుకుండేవాడు. అతనికి క్రికెట్‌లో ఆసక్తి హెచ్చు. అతను జవాహర్ కన్న చాలా సీనియరు కూడా. కపూర్తలా మహారాజు పెద్ద కొడుకు పరంజిత్ సింగ్ (తిక్కా సాహెబ్) కూడా అక్కడికి వచ్చాడు. అతన్ని అందరూ ఏడిపించేవారు. అతను కోపం వచ్చి, "మా కపూర్తలాకు రండి, మీ పని చెబుతాను," అని వాళ్ళని బెదిరించేవాడు.

జవాహర్ ఇంగ్లండులో తొలి రోజులలో ఒంటరితనం అనుభవించాడు. లోగడ అత నెప్పుడూ అపరిచితుల మధ్య ఉండ లేదు. అతను ఒకరిని పలకరించే వాడు కాడు, ఇతరులు కూడా అతని చాయలకు వచ్చే వారు కారు. అయినప్పటికీ అతను అవసర మైనంత వరకు నలుగురితోనూ కలిసే ఉండేవాడు. అతని "బస" హెడ్మాస్టరు ఇల్లే. రోజులుగడుస్తున్న కొద్దీ అతనికి హారో జీవితం నచ్చింది. సాధారణంగా బ్రిటిషు విద్యార్థులకు వ్యాయామ క్రీడలలో తప్ప

మరి దేనిలోనూ ఆసక్తి లేకపోవటం చూసి జవాహర్ ఆశ్చర్య పడేవాడు. అతనుమాత్రం రాజకీయాలలో ఆసక్తి కలిగి ఉండేవాడు. 1905 ఆఖరులో సాధారణ ఎన్నికలు జరిగి లిబరలు పక్షం వారు గెలిచారు. క్లాసులో మేస్టరు కొత్తగా మంత్రులైనవా రెవరని అడిగితే జవాహర్ ఒక్కడే చెప్పగలిగాడు!

బ్రిటిషు పత్రికలలో ఇండియాకు సంబంధించిన వార్తలు వివరంగా ఉండేవి కావు. కాని 1906-1907 సంవత్సరాలలో జవాహర్ తన మాతృదేశం గురించి చదివిన వార్తలు అతని కెంతో ఆందోళన కలిగించాయి. బెంగాలు, పంజాబు, మహారాష్ట్ర లలో ప్రముఖ సంఘటనలు సాగుతున్నాయి. లజపత్రాయ్‌నీ, అజిత్ సింగ్‌నూ ద్వీపాంతరం పంపారు. బెంగాలు కల్లోలంగా ఉన్నది. పూనా నుంచి తిలక్ గురించి వార్తలు వస్తున్నాయి. స్వదేశీ ఉద్యమమూ, విదేశీ వస్తు బహిష్కరణా సాగుతున్నాయి.

జవాహర్ హారోలో చేరిన రోజులలోనే తొలి విమానయాన ప్రదర్శనలు జరిగాయి. రైట్ సోదరులు అనేక పర్యాయాలు తాము నిర్మించిన విమానంలో ఎగిరారు. వారి విమానం అరగంట సేపు ఎగిరి 24 న్నర మైళ్ళ దూరం ప్రయాణించింది. అది



విమానయానాల నాందీ దశ. శాస్త్రజ్ఞానంలో ఆసక్తి గల జవాహర్‌ను ఈ ప్రయోగాలు ఆకర్షించాయి. అతను తన తండ్రికి ఉత్తరం రాస్తూ, "నేను విమానం మీద ఇంటికి వస్తానేమో!" అన్నాడు.

రెండేళ్ళు గడిచాక జవాహర్‌కు స్కూలు మొహం మొత్తి యూనివర్సిటి పై మోజు కలిగింది. దీనికి కారణం అతని మనసు పరిపాకం చెందుతూండటమే. చదువులో బాగా రాణించినందుకు అతనికి స్కూలు వాళ్ళు ఒక పుస్తకం బహుమానం చేశారు. గారిబాల్డీ అనే ఆయన ఇటలీ స్వాతంత్ర్య సమర వీరుడు. ఆయన రచించిన గ్రంథం



21

యొక్క ఇంగ్లీషు తర్జుమా మూడు సంపుటాలుగా వెలువడింది. అందులో ఒక సంపుటం మాత్రమే జవాహరుకు బహుమతి ఇచ్చారు. అతను మిగిలిన రెండు సంపుటాలూ కొని పుస్తకమంతా క్షుణ్ణంగా చదివి, ఇటలీకీ ఇండియాకూ అనేక సామ్యాలుండటం గమనించాడు.

జవాహరు మనసు ఒక వంక ఈవిధంగా పరిణామం చెందుతూంటే అవతల ఇండియాలో స్వాతంత్ర్యోద్యమం శాఖోపశాఖలుగా విస్తరించుతున్నది. 1857 తరువాత ఇదే అలాటి ఉద్యమం. 1904 లో బ్రిటిషు వారు బెంగాలును విభజించే ఆలోచన చేసినప్పటి నుంచీ ఈ ఉద్యమం మరింత ప్రజ్వరిల్లింది. ఈ ఉద్యమానికి ప్రముఖ స్థానాలలో ఒకటి అయిన మహారాష్ట్రంలో తిలక్ విజృంభించాడు. మితవాద వైఖరి అవలంబించి, మన్ను తిన్న పాములా ఉన్న కాంగ్రెసును వశపరచుకోవటానికి ఆయన 1907 లో ప్రయత్నించి విఫలుడైనాడు. ఆయన ఉపన్యాసాలూ, "కేసరి" పత్రికలో ఆయన రచనలూ చాలా ఘాటుగా ఉండేవి. గాంధీ రావటానికి పూర్వం ఆయనే జాతీయోద్యమానికి అగ్రనాయకుడుగా ఉండి, 1897 లోనే తొలి జైలు శిక్ష పొందాడు. బెంగాలులో బిపిన్ చంద్రపాల్ అనే వక్తా, అరవింద ఘోష్ అనే మాజీ కేంబ్రిజ్ విద్యార్థీ నాయకత్వం వహించారు. తిలక్ అనుచరులు గాని, బెంగాలీలు గాని అహింసావాదులు కారు.

ఈ పరిస్థితిలో జవాహర్‌కు హీరో చిన్నకూప మనిపించింది. అతను కేంబ్రిజ్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు. ఆ తరవాత కొద్ది రోజులకే మానిక్‌తలాలో ఒక బాంబుఫ్యాక్టరీ బయటపడింది. మానిక్‌తలా కుట్ర కేసు నడిచింది. దేశం అట్టుడికి పోయింది. దానిపై వ్యాఖ్యానించినందుకు అధికారులు తిలక్‌కు ఆరేళ్ళ జైలు శిక్ష విధించారు.






## 5

[దుర్గేశనందిని తిలోత్తమా, మానసింహమహారాజు కొడుకు జగతసింహుడూ శైలేశ్వర మందిరంలో కలుసుకున్నప్పుడు యువరాజు తానెవరో చెప్పుకున్నాడు, కాని తిలోత్తమ వెంట ఉన్న విమల తన యజమానురాలి వివరాలు అతనికి తెలపటానికి పదిహేను రోజులు వ్యవధి కోరింది. ఈలోపుగా ఆమె రెండు విషయాలు స్పష్టంగా తెలుసుకున్నది: ఒకటి, తిలోత్తమ యువరాజును గాఢంగా ప్రేమిస్తున్నది; రెండు, వారిద్దరి వివాహానికి దుర్గేశుడైన వీరేంద్రసింహుడు ఒప్పుకోడు. అయినప్పటికీ విమల తాను యువరాజు కిచ్చిన మాట నిలబెట్టుకోవటానికి శైలేశ్వర మందిరానికి రాత్రివేళ బయలుదేరి వెళ్ళింది.]

విమల మందిరం ప్రవేశించి, విశ్రాంతి తీసుకోవటానికి రెండు క్షణాలసేపు కూర్చుని, లేచి వెళ్ళి శైలేశ్వరుడి పాదాలకు వందనం చేసి, యువరాజు వద్దకు వచ్చి నమస్కరించింది.

కొద్దిసేపు ఇద్దరికీ సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలియలేదు. అయితే ఇలాటి విషయాలలో సిద్ధహస్తురాలైన విమల, "యువరాజా, శైలేశ్వరుడి అనుగ్రహం వల్ల నా కివాళ మీ దర్శన భాగ్యం కలిగింది. ఇంత రాత్రివేళ ఒంటరిగా వస్తూ దారిలో ప్రాణాలరచేత పట్టుకుని వచ్చాను. మీరు కనిపించాక మనస్సుకు కాస్త ధైర్యం వచ్చింది," అన్నది.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



23



"అందరూ క్షేమమా?" అని యువ రాజు అడిగాడు. అతడికి తిలోత్తమ పై నిజమైన గాఢానురాగం ఉన్నదీ లేనిదీ తెలుసుకో గోరి విమల, "ఆ క్షేమం కోసమే శైలేశ్వరుణ్ణి దర్శించ వచ్చాను. శైలేశ్వరుడు మీ పూజలకు అనుగ్రహించినట్టు నా కర్థ మయింది. నా పూజలు గ్రహించడు. తమ శలవైతే నేను వెళ్ళివస్తాను," అన్నది.

"వెళ్ళిరా! కాని ఒక్కతెవూ వెళ్ళటం భావ్యంకాదు. నేను వెంట వచ్చి దిగబెడ తాను," అన్నాడు జగతసింహుడు.

"ఒంటరిగా వెళ్ళటం ఎందుకు భావ్యం కాదు?" అని విమల అడిగింది.

"దారిలో ఎన్ని అపాయాలైనా కలగ వచ్చు," అన్నాడు యువరాజు.

"అలా అయితే నేను మానసింహ మహా రాజు వద్దకు వెళ్ళి, 'తమరు సేనాపతిగా నియమించిన వారి అధీనంలో స్త్రీలకు క్షేమం లేకుండా ఉంటున్నది; శత్రువులను అదు పులో ఉంచే దక్షత ఆయనకు లేదు,' అని చెబుతాను," అన్నది విమల గడుసుగా.

యువరాజు విరగబడి నవ్వి, "దేవతలకే తప్పలేదు, మనుష్యులన్న తరవాత శత్రువు లుండరా? ఉదాహరణకు శివుణ్ణే తీసుకో. ఆయన తపస్సు చేసుకునేటప్పుడు తన శత్రువైన మన్మధుణ్ణి భస్మం చేసేశాడు. ఆ మన్మధుడే ఒక పక్షం రోజుల క్రితం ఆ శివుడి మందిరంలోనే జొరబడి పెద్ద ఉపద్రవం కలిగించేశాడు," అన్నాడు.

"అంత ఉపద్రవానికి గురి అయిన వా రెవరు?"

"సేనాపతే."

"మహారాజా, అలాటి అసంగతమైన విషయాన్ని ఎవరు నమ్ముతారు?"

"నాకు సాక్ష్యం సిద్ధంగా ఉన్నది."

"ఎవరా సాక్షి?"

"నా ప్రేమకు విమలే సాక్షి!" అన్నాడు యువరాజు జగతసింహుడు.

"విమల మీ రనుకున్నట్టు సాక్షిగా ఉండదు."

"అదీ సంభవమే. ఏమంటే ఇచ్చిన మాట నిలబెట్టుకోని మనిషి నిజమైన సాక్ష్యం ఎలా చెబుతుందీ?" అన్నాడు యువరాజు.

"నేనేం మాట ఇచ్చానో కాస్త జ్ఞాపకం చెయ్యమని ప్రార్థన," అన్నది విమల.

"మీ యజమానురాలి పరిచయం."

విమల ఛలోక్తి ధోరణి విడిచిపెట్టి గంభీరంగా, "యువరాజా, పరిచయం చెయ్యటానికి జంకుగా ఉన్నది. ఆమెను గురించి తెలుసుకున్నాక మీకు ఏమైనా బాధ కలిగితే?" అన్నది.

జగతసింహుడు కూడా వెటకారపు ధోరణి విసర్జించి, "నిజం తెలుసుకోవటం వల్ల నాకు బాధ కలగటానికి తగిన కారణం ఉన్నదా, విమలా?" అని అడిగాడు.

"ఉన్నది."

జగతసింహుడు కొంచెంసేపు ఆలోచించి, "ఎమైతే అయింది, చెప్పు. నే నిప్పుడు పొందుతున్న బాధ కన్న హెచ్చు బాధ కలిగించే కారణం ఏదీ ఉండబోదు. విమలా, ఇవాళ నేను నిన్ను ఇక్కడ కలుసుకున్నది సరదా కోసం కాదు. ఈ పదిహేను రోజులుగా నేను నడుము వాల్చి ఎరగను," అన్నాడు.



ఆ మాట చెవిని వేసుకు నేటందుకే విమల ఇంతసేపూ నాటక మాడింది. కాని అప్పటికీ అసలు సంగతి బయట పెట్టక అతన్ని కబుర్లలో పెట్టింది. చివర కతను, "చెప్పు, విమలా, మీ చెలిని కలుసుకోవాలంటే ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగాడు.

"మందారణ దుర్గానికి వెళ్ళాలి. తిలోత్తమ వీరేంద్రసింహుడి కుమార్తె," అన్నది విమల.

ఈ మాట వినగానే జగతసింహుడికి కాల సర్పం కాటు వేసినట్టయింది. అతని చేతి కత్తి కింద పడిపోయింది. అతను దీర్ఘంగా నిట్టూర్చి, "నీ మాట నిజం! తిలోత్తమ

ఎన్నటికీ నాది కాదు. నేను యుద్ధరంగానికి పోయి నా కోరికను శత్రు రక్తంతో కడిగేసు కుంటాను," అన్నాడు.

అతని నిరాశా నిస్పృహలను చూసి విమల, "యువరాజా, ప్రేమ కేమైనా ప్రతి ఫలం ఉండే పక్షంలో దాన్ని తిలోత్తమకు ఇవ్వదగిన వాడవు నీవే!" అన్నది.

ఈ మాటలతో, అతని మనసులో ఆశ చిగిర్చింది. అతను విమలతో, "ఏమైనా ఇవాళ నా మనసు వికలంగా ఉన్నది. నిన్నొక్కటి వేడుకుంటాను, చెయ్యగలవా? నీవు వెళ్ళి మీ సఖికి నా పరిస్థితి చెప్పి, ఒక్కసారి—ఒకే ఒక్కసారి— నా కామె దర్శన భాగ్యం కలిగించమని చెప్ప గలవా?" అన్నాడు.

"దానికి మా సఖి ఏమంటుందో తమకు తెలిసే దెలా?" అని విమల అడిగింది.

"మాటి మాటికీ నిన్ను శ్రమ పెట్టటం నా కేమీ బాగా లేదు. కాని ఇంకొక్క సారి ఈ మందిరానికి వచ్చి నన్ను కలుసు కున్నట్టయితే నేను ఎప్పటికీ ఋణపడి ఉంటాను. జగతసింహుడి నుంచి నీకు ఇందుకు గాను ప్రత్యుపకారం లభించక పోదు!" అన్నా డతను.

విమల ఆ పని మాత్రం తన వల్ల కాదనీ, దారి చాలా భయమనీ, యుద్ధ పరిస్థితి కూడా



ఉంటున్నదనీ, మాట ఇచ్చాను గదా అని ఈ సారికి వచ్చాననీ అన్నది.

"ప్రమాదం ఉండదని నీకు తోచే పక్షంలో నేను నీ వెంట మందారణ దుర్గానికి వస్తాను. నేను అనుకూలమైన చోట వేచి ఉంటాను. నీవు వెళ్ళి జవాబు తీసుకురా!" అన్నాడు జగతసింహుడు.

విమల సంతోషంతో, "అయితే పదండి," అన్నది. వా రిద్దరూ మందిరంలోనుంచి వెలికి రాబోయే సమయంలో బయట అడుగుల చప్పుడయింది. జగతసింహు డాశ్చర్యపడి, "నీ వెంట మరెవరైనా వచ్చారా?" అని అడిగాడు.

"లేదే!" అన్న దామె.

"అయితే ఆ చప్పుడు చేసిన దెవరు? బయటి నుంచి ఎవరో మన సంభాషణ విన్నారని నాకు తోస్తుంది," అంటూ అతను బయటికి వచ్చి, చుట్టూ కలయజూశాడు, కాని ఎవరూ కానరాలేదు.

ఆ ఇద్దరూ శైలేశ్వరుడికి నమస్కరించి, మందారణాని కేసి కొంతదూరం నడిచినాక యువరాజు, "నా కొక విషయం తోస్తున్నది, చెబితే నీ వేమంటావో మరి," అన్నాడు.

"ఏమిటది?" అని విమల అడిగింది.

"నీవు పరిచారికవు కాజాలవని నా మనస్సులో అనిపిస్తున్నది."






"మీ కలా అనుమాన మెందుకు కలిగింది?"

"వీరేంద్రసింహుడి కుమార్తె అంబర రాజు కోడలు కాజాలదు; అందు కొక నిగూఢ కారణం ఉన్నది. ఆ కారణం పరి చారికకు తెలియటం సాధ్యం కాదు. నీ కెలా తెలిసింది?"

విమల దీర్ఘశ్వాస తీసుకుని విచార స్వరంతో, "మీ అనుమానం నిజమే. నేను పరిచారికను కాను, అభాగ్యవశాన పరిచారిక లాగా ఉంటున్నాను," అన్నది.

ఈ ప్రస్తావన ఆమెకు బాధాకరమని గ్రహించి జగతసింహు డేమీ అనలేదు. విమల తనకు తానే, "యువరాజా, నేను నా విషయమంతా చెబుతాను, కాని ఇప్పుడు కాదు... అదేమిటా చప్పుడు? మన వెనక ఎవరో వస్తున్నట్టున్నది," అన్నది.

వెనక నుంచి అడుగుల చప్పుడు విన పడింది. ఎవరో గుస గుస లాడుకున్నట్టు కూడా వినిపించింది. అప్పటికి వారు మందిరం నుంచి ఒక మైలుదూరం వచ్చి ఉంటారు.

"మనని ఎవరో వెంటాడి వస్తున్నారు," అంటూ జగతసింహుడు ముందుకు సాగాడు. వారు చిన్నగా మాట్లాడుకుంటూ వేగంగా నడవ సాగారు.

వారు మందారణానికి చేరేసరికి నడిరాత్రి అయింది. "ఇంత రాత్రివేళ దుర్గంలోకి ఎలా ప్రవేశిస్తావు?" అని రాజకుమారుడు విమల నడిగాడు.

"ఆ భయమేమీ లేదు. ఆ ఉపాయా లన్నీ చూసుకునే ఇంటి నుంచి బయలు దేరాను," అన్నది విమల.

ఇద్దరూ దుర్గం వెనుకతట్టున ఉన్న మామిడి తోటలో ప్రవేశించారు.

"ఈ తోట కూడా నిర్జన స్థలం కాదు. మీరు నా వెంట దుర్గంలోకి రండి," అన్నది విమల.



జగతసింహుడు కొంచెం ఆలోచించి, "నే నలా చెయ్యటం ఉచితం కాదు. దుర్గేశుడి అనుమతి లేకుండా నే నెలా దుర్గంలోకి అడుగు పెట్టేది ?" అన్నాడు. అంబర రాజకుమారుడైన తాను అలా దుర్గంలో ప్రవేశించటం దొంగవాడు చేసే పని అని అతనికి అనిపించింది.

"నేను వెంట ఉండి తీసుకుపోతున్నాను కదా ?" అన్నది విమల.

"కాని నీకు నన్ను దుర్గంలోకి తీసుకుపోయే అధికారం ఉన్నదా? పరిచారికవని తక్కువ చేసి ఈ మాట అడుగుతున్నాననుకోవద్దు," అన్నాడు యువరాజు.

విమల కొంచెం సేపాలోచించి, "నాకున్న అధికారం ఏమిటో తెలుసుకోకుండా నా వెంట రాలేరా ?" అని అడిగింది.

"ఎంతమాత్రం రాలేను," అన్నాడతను.

విమల అతని చెవిలో ఏదో రహస్యంగా చెప్పింది.

"పద!" అన్నాడతను.

ఇంతలో తోటలోని ఎండుటాకులపై ఎవరో నడుస్తున్న ధ్వని అయింది.

"అదుగో మళ్ళీ!" అన్నది విమల.

"కొంచెంసేపిక్కడే ఉండు. నేను వెళ్ళి చూసి వస్తాను," అని అతను కత్తి దూసి




ధ్వని వినిపించిన వైపు వెళ్ళాడు. అతనికెక్కడా ఎవరూ కనిపించలేదు. పోషణ లేక మామిడి తోటంతా అడవిలాగా పెరిగి ఉన్నది. అందులో ఎంత మంది అయినా దాగవచ్చు.

జగతసింహుడు కత్తి చేత పట్టుకుని ఒక చెట్టెక్కాడు. దాని పై నుంచి అతను చుట్టూ కలయ జూసిన మీదట అతని దృష్టి అన్నిటి కన్న ఎత్తుగా ఉన్న ఒక చెట్టుపైన పడింది. దాని పైన ఇద్దరు మనుషులు దాగి ఉన్నారు. వెన్నెలలో వారి తలపాగాలు మాత్రమే కనిపిస్తున్నాయి. అత నా చెట్టును చక్కగా గుర్తు పెట్టుకుని, తా నెక్కిన చెట్టు

నుంచి దిగి వచ్చి, విమలకు తాను చూసి నది చెప్పి, "ఇప్పుడు రెండు బల్లా లుంటే బాగుండును," అన్నాడు.

"ఎందుకు?" అన్నది విమల.

"వాళ్ళెవరో తెలుసుకోవటానికి. పరిస్థితి అనుమానాస్పదంగా ఉన్నది. తలపాగాలు చూస్తే, ఈ దుష్ట పఠాను లేదో దురుద్దేశం తోనే మనని వెన్నాడుతున్నట్టు తోస్తుంది," అన్నాడు జగతసింహుడు.

వెంటనే విమలకు దారిలో తాను చూసిన గుర్రం కళేబరమూ, తలపాగా మొదలైనవి జ్ఞాపకం వచ్చి భయం కలిగింది. "మీ రిక్కడే ఉండండి. నేను దుర్గంలోకి వెళ్ళి ఇప్పుడే బల్లాలు తెస్తాను," అంటూ చర చరా వెళ్ళిపోయిం దామె.

విమల దుర్గపు రహస్య ద్వారాన్ని తన తాళపు చెవితో తెరిచి, లోపల ప్రవేశించి, రహస్య ద్వారానికి తాళం వేసి, ఆయుధా గారానికి వెళ్ళి, అక్కడ ఉండే మనిషితో, "నాకు రెండు బల్లాలు కావాలి. ఇప్పుడే తిరిగి ఇస్తాను," అన్నది.

"అమ్మా, వాటితో మీకేం పని?" అని ఆయుధాగార రక్షకు డడిగాడు.

"ఇవాళ వీరపంచమి. వీరమాతను కాపటానికని వ్రతం చేస్తున్నాను. ఎవరికీ చెప్పకు," అన్నది విమల.

అత డిచ్చిన రెండు బల్లాలూ తీసుకుని ఆమె వేగంగా యువరాజున్న చోటికి తిరిగి వచ్చింది; కాని తొందరలో రహస్య ద్వారా నికి తాళం వెయ్యటం మరిచిపోయింది. ఇందువల్ల గొప్ప విపత్తు సంభవించింది.

వెలుపల అస్త్రధారిగా ఉన్న పురుషు డొకడు రహస్య ద్వారం బార్లా తెరిచి ఉండటం గమనించి ఆ ద్వారం కుండా దుర్గంలో ప్రవేశించాడు. ఎక్కడా ఎవరూ మేలుకుని ఉన్న జాడలు లేవు. ఆ మనిషి తిన్నగా అంతఃపురం దాకా వెళ్ళి పోయాడు.

—(ఇంకా వుంది)






# కర్మపరిపాకం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ వేళ కాని వేళ నీ వీ విధంగా ఈ శవాన్ని మోస్తున్నావంటే నీ కర్మపరిపాకం చెందక పోవటమే కారణ మని తోస్తుంది. పూర్వం నీలాగే ధనగుప్తుడనే వాడు తరించటానికి ఎన్నో అవకాశాలు లభించి కూడా, కర్మపరిపాకం కానందున ఎన్నో హీన జన్మ లెత్తాడు. శ్రమ తెలియకుండా ఆ ధనగుప్తుడి కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ధనగుప్తుడు కాశీ నగరంలో వ్యాపారం చేసుకునే వాడు. వ్యాపార దక్షత కలవాడు కావటం చేత ధనం పుష్కలంగా గడించాడు. ధనార్జనకు తగ్గట్టు ధనగుప్తుడికి దైవ భక్తీ, ధర్మపరత్వమూ కూడా ఉండేవి.

## బేతాళ కథలు



ఎప్పుడూ బీదలకు దానాలు చేసేవాడు. యతులకూ, సన్యాసులకూ ఆతిథ్య మిచ్చే వాడు. అతనికి ముగ్గురు కొడుకులుండేవారు.

ఒకనాడు మానససరోవరం నుండి దయానందు డనే సిద్ధుడు ధనగుప్తుడి ఇంటికి వచ్చాడు. ధనగుప్త డాయనకు భక్తితో పాదపూజ చేసి, ఆతిథ్య మిచ్చాడు. అతని నిష్కపటమైన భక్తి శ్రద్ధలు చూసి సంతోషించి, సిద్ధుడు ధనగుప్తుణ్ణి ఏకాంతంగా దగ్గిరికి పిలిచి, "నాయనా, నీకు తరించే దారి చూపమంటావా?" అని అడిగాడు. ధనగుప్తుడు సిద్ధుడికి కృతజ్ఞత చెప్పుకుని, "స్వామీ, అంతకంటె నాకు కావలిసిందేమున్నది? అయితే నా కొడుకు లింకా చిన్నవాళ్ళు. మరొక అయిదేళ్ళు పోతే వాళ్ళు తమ కాళ్ళ మీద తాము నిలబడ గలుగుతారు. అప్పుడు నాకు తరించే మార్గం ఉపదేశింతురు గాని," అన్నాడు.

సిద్ధుడు, "సరే, అలాగే కానీ!" అని చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన ఆరు మాసాలకే ధనగుప్తుడు గుండె జబ్బు వచ్చి మరణించాడు. అతని కొడుకులు చిన్న పిల్లలు కావటం చేత వారికి వ్యాపారం గొడవలు తెలియలేదు. వారికి తోడ్పడే మిషమీద పదిమందీ చేరి వారి డబ్బంతా తినేశారు. వ్యాపారం మూలపడే సరికి ధనగుప్తుడి కొడుకులు రెండు గిత్తలను కొని వ్యవసాయం సాగించారు. వారికి అందులో కొంత కలిసి వచ్చింది. ఏదో ఒక విధంగా వారు కాలక్షేపం చేస్తూ వచ్చారు.

ధనగుప్తుడు చెప్పిన అయిదేళ్ళ గడువు తీరగానే దయానంద సిద్ధుడు మళ్ళీ వచ్చాడు. ధనగుప్తుడు చనిపోయాడని అతని కొడుకుల ద్వారా తెలుసుకుని సిద్ధుడు తిరిగి వెళ్ళిపోతూ, బయట ఉన్న పశువుల కొట్టంలో ఉన్న ఒక గిత్తను చూసి అది ధనగుప్తుడే నని తెలుసుకున్నాడు.

ఆయన ఆ గిత్తను సమీపించి దానిపై కమండలూదకం చల్లి, "నాయనా, ఇప్పుడైనా తరుణోపాయం చెప్పమంటావా?" అని అడిగాడు.

ఆ గిత్త మనుష్య భాషలో, "స్వామీ, మరొక అయిదు సంవత్సరాలు ఆగండి. నేను లేని కారణంచేత నా కొడుకులు వ్యాపారంలో దెబ్బతిని వ్యవసాయం మొదలు పెట్టారు. నా సహాయంతో వాళ్ళకు వ్యవసాయం కాస్త గిట్టుబాటుగా ఉంటున్నది. మరో అయిదేళ్ళిలాగే సహాయపడ్డానంటే వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడతారు," అన్నది.

"సరే, అలాగే కానీ!" అంటూ సిద్ధుడు వెళ్ళిపోయాడు.

సిద్ధుడు వెళ్ళిన కొద్ది కాలానికే ఆ గిత్త రోగం వచ్చి చచ్చింది. అది మొదలు ధనగుప్తుడి కొడుకులకు వ్యవసాయంలో నష్టం వచ్చింది. కారణాంతరాలు కూడా ఏర్పడటం వల్ల వాళ్ళు ఉన్న కాస్త పొలమూ, ఇల్లూ పోగొట్టుకుని, ఊరి చివర చిన్న పాకా ఒకటి వేసుకుని, కూలి చేసుకుంటూ పొట్ట పోసుకోసాగారు.

మళ్ళీ అయిదు సంవత్సరాలు కాగానే సిద్ధుడు, గిత్త రూపంలో ఉన్న ధనగుప్తుణ్ణి




వెతుక్కుంటూ వచ్చాడు. ధనగుప్తుడి కొడుకులు ఊరి బయట పాకలో ఉన్నట్టు విని ఆయన అక్కడికి వచ్చేసరికి ఒక కుక్క బొంయి మని అరుస్తూ ఆయన మీదికి వచ్చింది.

సిద్ధుడు దానిపై కమండలూదకం చల్లి, "ఏమి నాయనా, ఇప్పటికైనా ఉపదేశం పొందుతావా?" అని అడిగాడు.

"ఇంకొక్క అయిదు సంవత్సరాలాగండి, స్వామీ. నా కొడుకులు కూలి చేసుకుని కాస్త కాస్తే వెనక వేసుకుంటున్నారు. యాచకులూ, దొంగలూ రాకుండా నేను కాపలా కాస్తున్నాను. అయిదేళ్ళు ఇలా



33




సిద్ధుడు ధనగుప్తుడి కోసం దివ్య దృష్టితో వెతకగా అతను భూమిలోపల ఒక చోట పాము రూపంలో లంకె బిందెలను అంటి పెట్టుకుని ఉన్నట్టు తెలియవచ్చింది. ఆయన ధనగుప్తుడి కొడుకులతో, "నాయన లారా, మీకు లంకె బిందెలు దొరికే చోటు చూపుతాను, వాటిని తవ్వి తెచ్చుకుంటారా?" అని అడిగాడు.

"అంతకంటే కావలిసిందేమిటి?" అంటూ ధనగుప్తుడి కొడుకులు ముగ్గురూ, మూడు గడ్డపారలు తీసుకుని సిద్ధుడి వెంట వెళ్ళి, ఆయన తవ్వమన్న చోట తవ్వారు. లంకెబిందెలు దొరికాయి, కాని వాటిని చుట్టుకుని ఉన్న ఒక పెద్ద పాము తల ఎత్తి చూసింది. వెంటనే ముగ్గురూ దాని మీద మూడు దెబ్బలు వేశారు.

సిద్ధుడు వారిని వారించి ఆ పామును పూర్తిగా చావకుండా కాపాడి, దాని పై కమండలూదకం చల్లి, "నాయనా, ఇప్పుడైనా తరించే మార్గం చెప్పమంటావా?" అని ప్రశ్నించాడు.

పాము బాధగా తల ఎత్తి, మానవ భాషలో, "త్వరగా చెప్పండి, స్వామీ," అన్నది. సిద్ధుడు దాని చెవిలో ఏదో రహస్యం చెప్పాడు. అంతా విని పాము

కాపాడానంటే ఆ తరువాత వాళ్ళ కాళ్ళ పైన వాళ్ళే నిలబడతారు," అన్నది కుక్క మనిషి భాషలో.

"సరే అలాగే కానీ!" అంటూ సిద్ధుడు వెళ్ళి పోయాడు.

కొద్ది రోజులకే ఆ కుక్క కూడా చని పోయింది. ధనగుప్తుడి కొడుకులు బొత్తిగా నికృష్టపు జీవితం గడుపుతున్నారు. అయి దేళ్ళు తిరగగానే తిరిగి సిద్ధుడు వారున్న చోటికి వచ్చాడు. కుక్క విషయం ఆయన విచారించగా ధనగుప్తుడి కొడుకులు అది నాలుగైదేళ్ళ కిందట రోగం వచ్చి చని పోయినట్టు చెప్పారు.

తల వాల్చేసి ప్రాణాలు విడిచింది. ధన గుప్తుడి కొడుకులు ఆ లంకె బిందెలు పట్టుకు పోయి, తిరిగి ఆస్తి పాస్తులు సంపాదించి బాగు పడ్డారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. పాము జన్మ కన్న కుక్క జన్మా, దాని కన్న పశువు జన్మా, దాని కన్న మానవ జన్మా ఉత్తమమైనవి గదా. ఉత్తమ జన్మ లెత్తినప్పుడు కూడా ధనగుప్తుడికి తరించా లని లేని తహతహ పాము జన్మలో ఎందుకు కలిగింది? అతను ఇంకా హీన జన్మ లెత్త వలిసి వస్తుందని భయపడ్డాడా? లేక లంకె బిందెలు పొందాక తన కొడుకులకు తన సంరక్షణతో యిక అవసరముండ దను కున్నాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధనగుప్తుడి మనసు మారటానికి హీన జన్మ లెత్తుతానన్న భయమూ కారణం కాదు, ఇకముందు తన కొడుకులకు తన సంరక్షణ అవసరముండ దన్నదీ కారణం కాదు. కొడుకుల పై గల మమకారమే అతన్ని తరించ నివ్వకుండా చేసింది. ఆ మమకారం చేతనే అతను కుక్క జన్మ ఎత్తికూడా తాను హీన జన్మ ఎత్తినందుకు విచారించలేదు. ఇక సంరక్షణ మాటకు వస్తే, అతను ఎంతగా సంరక్షించినా అతని కొడుకుల స్థితి అంత కంతకూ దిగ జారి పోయిందేగాని, అణు మాత్రమైనా మెరుగు కాలేదు. అందుచేత ధనగుప్తుడిలో అసలైన పరివర్తనకు కారణం కొడుకులపై మమకారం పోవటం; దానికి కారణం వారు అతన్ని కొట్టిన చావు దెబ్బలు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.

[జె. యుగంధరశర్మ రచన ఆధారంగా]






# జింక మంత్రం

ఒక ఊళ్ళో ఒక నిరుపేద ఉండేవాడు. అతనికి బతుకుతెరువు ఏదీ దొరకలేదు. ఎన్ని గ్రామాలు తిరిగినా ఎక్కడా పని దొరకలేదు. జానెడు పొట్ట కోసం ఇన్ని పాట్లు పడేకంటె బైరాగి వేషం వేస్తే జీవితం సుఖంగా వెళ్ళిపోతుందని గ్రహించి అతను బైరాగిగా తయారయాడు.

బైరాగి వేషంలో అతను ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి పోతూ ఎండవేళ ఒక చెట్టు నీడన కూర్చుని ఉండగా భీమయ్య అనే పేదవా డొకడు ఆ బైరాగిని చూసి సాష్టాంగ పడి, కాళ్ళు రెండూ పట్టుకున్నాడు. "ఏంకావాలి, నాయనా?" అని బైరాగి భీమయ్యను అడిగాడు.

"తమరు సిద్ధులు. నేను బతుకుతెరువు చూసుకోలేని కటిక దరిద్రుణ్ణి. నన్ను తమ శిష్యుడుగా ఉంచుకోండి. నేను తమ వెంట వస్తాను. తమ వంటి వారి పాదసేవ చేసుకుంటే ఇహమూ పరమూ ఉంటాయి," అన్నాడు భీమయ్య.

ఈ మాటలు విని బైరాగి భయపడ్డాడు. తాను దూర కంతలేదు, మెడ కొక డోలన్నట్టు తన పొట్ట తాను నించుకో లేకుండా ఉంటే ఈ శిష్యుడు కూడా వెంట దేనికి? ఈ భీమయ్యను ఎలా వదిలించుకోవటమా అని బైరాగి నాలుగు పక్కలా చూసేసరికి కొంత దూరాన ఒక జింక తన శరీరాన్ని చెట్టు కేసి రుద్దుకుంటూ కనిపించింది. అతను భీమయ్య కా జింకను చూపించి, "అది ఏం చేస్తున్నది?" అని అడిగాడు.

"ఒళ్ళు చెట్టు కేసి రుద్దుకుంటున్నది," అన్నాడు భీమయ్య.

"నువు రుద్దేది నా కెరుకే! నువు రుద్దేది నా కెరుకే! నువు రుద్దేది నా కెరుకే! అని మూడు సార్లు అను," అన్నాడు బైరాగి.

పి. పద్మారావు



"నువ్వు రుద్దేది నా కెరుకే!" అని భీమయ్య మూడు సార్లన్నాడు.

"అది ఇప్పుడేం చేస్తున్నది?" అన్నాడు బైరాగి.

"మన కేసి చూస్తున్నది," అన్నాడు భీమయ్య.

"నువ్వు చూసేది నా కెరుకే! అని మూడు సార్లు అను," అన్నాడు బైరాగి.

భీమయ్య అలాగే అన్నాడు.

"ఇప్పు డది ఏం చేస్తున్నది?" అని బైరాగి అడిగాడు.

"చెట్టు కింది నుంచి వెళ్ళిపోతున్నది," అన్నాడు భీమయ్య.

"నువ్వు పొయ్యేది నా కెరుకే, అని మూడు సార్లు అను," అన్నాడు బైరాగి.

భీమయ్య అట్లాగే అన్నాడు.

"ఇది జింక మంత్రం! ఈ మంత్రాన్ని అస్తమానమూ జపిస్తూ ఉన్నట్టయితే కొంత కాలానికి సిద్ధించి సకల సంపదలూ సమకూరుస్తుంది. ఎవరికీ చెప్పని ఈ జింక మంత్రం నీకు ఉపదేశించాను. నాయనా, ఇక వెళ్ళిరా!" అన్నాడు దొంగ బైరాగి.

భీమయ్య భక్తితో బైరాగికి సాష్టాంగ నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని, జింక మంత్రం పఠిస్తూ బయలుదేరి, ఒక నగరం చేరుకున్నాడు.

ఆ నగరం ఏలే రాజుకు లేకలేక ఒక కొడుకు పుట్టాడు. ఇందువల్ల మంత్రి గొంతుకు పచ్చి వెలగకాయ అడ్డం పడ్డట్టయింది. ఎందుకంటే, రాజు కిక సంతానం కలగదని నిశ్చయించుకుని, తానే రాజు కావటానికి తగిన సన్నాహాలన్నీ మంత్రి చేసుకుని ఉన్నాడు. రాజుగారు బతికి ఉండగా రాజ్య తంత్రమంతా తన చేతుల్లోనే ఉంటుంది; ఆయన పోయిన మరు క్షణం రాజ్య యంత్రం కూడా తనదే అవుతుందని మంత్రి ఆశపడ్డాడు. రాజుకు కొడుకు పుట్టటంతో ఆ ఆశ అడుగంటింది. ఈ రాజు

పాయ్యేనాటికి మరొక రాజు పెరిగి సిద్ధంగా ఉంటాడు. అందుచేత రాజుకొడుకు చంటి పిల్లవాడుగా ఉండగానే ఈ పెద్ద రాజును తొలగిస్తే రాజ్యం చాలా ఏళ్ళపాటు తన అధీనంలోనే ఉంటుంది.

మంత్రి రాజుగారి మంగలిని పిలిచి, "ఒరే, నువ్వు రాజుగారికి గడ్డం చేసేటప్పుడు ఒక్క దెబ్బన ఆయన మెడ నరికెయ్యి. నీకు మంచి జాగీరిస్తాను," అన్నాడు.

మంగలి భయపడి, "బాబోయ్, దొరికా నంటే తల తీసేస్తారు!" అన్నాడు.

"రాజుగారు పోతే అధికారం నాదే గాదుట్రా? నీ తల ఎవరు తీస్తారు? కావలిస్తే నీకు అభయ పత్రం రాసిస్తాను," అన్నాడు మంత్రి. మంత్రి వద్ద నుంచి అభయ పత్రం పొంది, జాగీరు సంపాదించుకునే దురాశతో మంగలి రాజుగారి తల నరికెయ్యటానికి సిద్ధపడి, మర్నాడు రాజ భవనం పంచలో కూర్చుని కత్తి నూరుతున్నాడు.

సరిగా అదే సమయంలో భీమయ్య జింక మంత్రం ఉచ్చాటన చేస్తూ, "నువ్వు రుద్దేది నా కెరుకే! నువ్వు రుద్దేది నా కెరుకే! నువ్వు రుద్దేది నా కెరుకే!" అంటూ అటుగా వచ్చాడు. మంగలి ఈ మాటలు విని అడిలిపోయి భీమయ్య కేసి చూశాడు.



"నువ్వు చూసేది నా కెరుకే! నువ్వు చూసేది నా కెరుకే! నువ్వు చూసేది నా కెరుకే!" అన్నాడు భీమయ్య.

మంగలికి గుండెదడ హెచ్చింది. వాడు చల్లగా కత్తి పొదిలో పెట్టేసి, పొది తీసుకుని వెళ్ళిపోవటానికి ఉపక్రమించాడు.

"నువ్వు పొయ్యేది నా కెరుకే! నువ్వు పొయ్యేది నా కెరుకే! నువ్వు పొయ్యేది నా కెరుకే!" అన్నాడు భీమయ్య.

మంగలి కాలి సత్తువ కొద్దీ అక్కణ్ణించి పరిగెత్త సాగాడు.

గడ్డం చేయించు కోవటాని కని లోపలి నుంచి వచ్చిన రాజుగారు మంగలి పారి

పోతూండటం చూసి, వాణ్ణి పట్టుకు రమ్మని నౌకర్లను తరిమాడు. వాళ్ళు మంగలి వెంట పడి పరిగెత్తి పట్టుకుని రాజుగారి దగ్గిరికి తీసుకువచ్చారు.

జింకమంత్రం జపించటంలో నిమగ్నుడై ఉన్న భీమయ్య ఈ అడావుడంతా చూసి, మంత్రం మాట మరిచిపోయి వింత చూస్తూ అక్కడే నిలబడ్డాడు. ఎవడో పారి పోవటమూ, వాణ్ణి భటులు తరిమి పట్టుకుని తీసుకురావటమూ భీమయ్యకు కనిపించింది గాని, ఆ పారిపోయిన వాడు దొంగ తనమే చేశాడో, మరేమిటి చేశాడో భీమయ్యకు అర్థం కాలేదు.

రాజుగారి ఇంటి ముందు చిన్న గుంపు చేరింది. మంగలి రాజుగారి కాళ్ళు పట్టుకుని వలవలా ఏడుస్తూ, మంత్రి చేసిన కుట్ర అంతా బయటపెట్టాడు. మంత్రి ఇచ్చిన అభయ పత్రం కూడా చూపాడు. అంతా అయినాక వాడు, "మహారాజా, ఇవాళ నేను లేచిన వేళ మంచిది. ఆ దారే పోయే ఆయన నా రహస్యం కనిపెట్టాడు గనక నేను రాజద్రోహం చెయ్యకుండా తప్పించు కున్నాను!" అన్నాడు.

ఆ మంగలి గుంపులో ఉన్న భీమయ్యను చూసి గుర్తుపట్టి, "ఈ మహాత్ముడే నా ద్రోహం కనిపెట్టాడు," అన్నాడు.

రాజు భీమయ్యను చాలాసేపు ప్రశ్నించిన మీదట అసలు సంగతి బయటపడింది. భీమయ్యకు మంగలి తలపెట్టిన ద్రోహం మాట ఏమీ తెలియదు. అతను జింక మంత్రం పఠించాడు—అంతే!

రాజుగారు రాజద్రోహం తలపెట్టిన మంత్రికి ఉరి శిక్ష విధించి, మంగలికి దేశ బహిష్కార శిక్ష విధించి, జింక మంత్రంతో తన ప్రాణం కాపాడిన భీమయ్యకు మంచి జాగీరిచ్చి, అతన్ని తన కొలువులో ఉంచు కున్నాడు. జింక మంత్రం అతని సమస్య లన్నిటినీ తీర్చేసింది.





# పాముపెళ్ళికొడుకు

శరభదేశపు రాజుకు పిల్లలు లేరు. రాజు ఒక కొడుకు కోసమూ, రాణి ఒక కూతురి కోసమూ తపించిపోయారు. ఒక రోజు రాణి తమ ఉద్యానం అవతల ఉన్న చెట్ల మధ్య విచారంగా పచార్లు చేస్తూ ఉండగా, ఒక ఎండు చెట్టు మొదట్లో ఒక పళ్ళు లేని బోసి నోటి ముసలిది కూర్చుని, "ఏం, మహా రాణీ, అంత విచారంగా ఉన్నావు?" అని అడిగింది. రాణి తన గొడవ ఆ ముసలి దానికి చెప్పుకున్నది.

"నీకు పిల్లలు కావాలంటే నేను చెప్పినట్టు చెయ్యి. ఈ రోజు సూర్యాస్తమయమయిన వెంటనే మీ పూలతోటలో ఈశాన్య దిక్కున నేల మీద ఒక బంగారు గిన్నె బోర్లించు. రేపు ఉదయం సూర్యు డుదయించబోయే సమయంలో గిన్నె ఎత్తి చూడు. దాని కింద ఒక బుల్లి మొక్క కనిపిస్తుంది. దానికి రెండు రెమ్మలుంటాయి. ఒక రెమ్మన తెల్ల పూవూ, రెండో రెమ్మన ఎర్ర పూవూ ఉంటుంది. తెల్లపూవు రెక్కలు తింటివా మగ పిల్లవాడు పుడతాడు. ఎర్ర పూవు రెక్కలు తింటివా ఆడపిల్ల పుడుతుంది. రెండు పూల రెక్కలూ మాత్రం తినకు," అని చెప్పింది ముసలిది.

రాణి పుత్రకాంక్షతో ముసలిది చెప్పినట్టే చేసింది. మర్నాడు సూర్యోదయం కాబో తుండగా వెళ్ళి చూస్తే గిన్నె కింద చిన్న మొక్క, దానికి రెండు పూలూ ఉన్నాయి. తనకు కూతురు కావాలని ఉన్నప్పటికీ తన భర్త ఆనందం కోసం మగ పిల్లవాణ్ణి కన గలందులకు తెల్ల పూవు రెక్కలు తినేసింది. కాని ఎర్ర పూవును విడిచిపెట్ట బుద్ధికాక దాని రెక్కలు కూడా తినేసింది.

తరవాత రాణి గర్భవతిగా ఉన్నది. రాజభవనంలో అందరూ సంతోషించారు. తొమ్మిది నెలలు నిండగానే ఒక నాడు

టి. నరసింగరావు

రాణికి నొప్పులు ఆరంభమయాయి. ఆ దశ లోనే ఆమె గర్భం నుంచి ఒక పాము వెలువడింది. ఆమెకు భయంతో ముచ్చెమ టలు పోశాయి. ఆమె ఎవరినన్నా పిలిచే లోపుగా ఆ పాము పాకుతూ ఎటో వెళ్ళి పోయింది. తరవాత రాణికి నొప్పులు జాస్తి అయి ఆమె ఒక అందమైన కొడుకును కన్నది. అందరూ రాణి కన్నది ఆ ఒక్క కొడుకునే అనుకున్నారు.

ఏళ్ళు గడిచాయి. రాజకుమారుడు దిన దిన ప్రవర్థమానుడై యుక్త వయస్కు డయాడు. రాజు తన కొడుకుతో, "నాయనా, నీ విప్పుడు వివాహయోగ్యుడివి. నీకు కావలిసిన భార్యను నీవే వెతుక్కొని పెళ్ళి చేసుకో," అన్నాడు.

రాజకుమారుడు సపరివారంగా దేశాట నకు బయలుదేరాడు. అతను నగరం విడిచి కొద్దిదూరం వెళ్ళాడో లేదో, ఒక పెద్ద చెట్టు కొమ్మను చుట్టుకుని ఉన్న ఒక మహా సర్పం పెద్దగా బుసకొట్టి అతని దారికి అడ్డొ చ్చింది. రాజకుమారు డెక్కిన గుర్రం బెదురుకుని వెనక కాళ్ళపై లేచి నిలబడి, పైనున్న రాజకుమారుణ్ణి కింద పడేసినంత పని చేసింది.

"ఒరే, నా పెళ్ళి తరవాతే నీ పెళ్ళి!" అని ఆ సర్పం మనిషి భాషలో అరిచింది.



రాజకుమారుడు బెదిరిపోయి, సపరివారంగా వెనక్కు తిరిగి వచ్చేశాడు. వచ్చి తండ్రితో పాము అన్న మాటలు చెప్పాడు.

రాజు అంతా విని తన భటులను పిలిచి, "ఒరే మీరందరూ వెళ్ళి ఆ దిక్కుమాలిన పామును చంపిరండి," అన్నాడు.

రాణి కంగారుపడి, రాజు ప్రయత్నం ఆపి, తనకు బోసినోటి ముసలిది కనబడిన తరవాత జరిగినదంతా చెప్పి, "ఆ పాము మన పెద్ద కొడుకే. వాడికి పెళ్ళి కాకుండా చిన్నవాడి పెళ్ళి ఎలా చేస్తాం?" అన్నది.

"ఎక్కడి ప్రారబ్ధం వచ్చిపడిందిరా, భగవంతుడా!" అనుకుని రాజు, ఒక దూరదేశపు రాజు వద్దకు దూతలను పంపి, "మీ అమ్మాయిని పంపండి, నా కొడుక్కు చేసుకుంటాను," అని అడిగించాడు.

ఈ రాజుకు ఒకడే కొడుకని లోకమంతా అనుకుంటూండటం చేత వాళ్ళు తమ పిల్లను సంతోషంగా పంపించారు. పాముకూ ఆ రాజు కూతురికీ రహస్యంగా పెళ్ళి చేసి గదిలోకి పంపేశారు. ఆ రాత్రి పాము దుస్తులు తప్ప మరేమీ మిగల్చకుండా రాజకుమార్తెను మింగేసింది.

జరిగిన ఘోరం సంగతి విని, రాజు నెత్తీ నోరూ బాదుకున్నాడు. పాము తన దారిన తాను ఎటో వెళ్ళిపోయింది.



మరసటేడు రాజకుమారుడు కన్యాన్వేషణకై మళ్ళీ బయలుదేరాడు. ఈసారి కూడా అతన్ని సర్పం అటకాయించి, "తమ్ముడూ, నా పెళ్ళి అయితేనేరా నీ పెళ్ళి!" అన్నది.

ఈసారి రాజుకు మతి పోయినట్టయింది. పాము ఇలా ఎంతమంది రాజ కుమార్తెలను పొట్టన పెట్టుకుంటుందో! ఆయన నగరం వెలపల అరణ్యంలో ఉంటున్న ఒక కాపు వద్దకు వెళ్ళి, "నీ కిద్దరు కూతుళ్ళున్నారట. ఒక కూతుర్ని నా కొడుక్కిచ్చి వివాహం చేశావంటే నిన్ను ఐశ్వర్యంలో ముంచెత్తుతాను," అన్నాడు.

"కొడుకంటే పామేనా, మహారాజా? నాకు ఐశ్వర్యం వద్దు, ఇలాగే బతకనివ్వండి," అన్నాడు కాపు. పాము సంగతి ఎంత దాచినా దాగలేదు.

కాని రాజు పట్టుబడితే బీదవాడైన కాపు ఏం చెయ్యగలడు? కాపు పెద్ద కూతురికీ పాముకూ పెళ్ళి నిశ్చయమయింది. మర్నాడే ముహూర్తం.

కాపు కూతురు పుట్టెడు దిగులుతో ఆ సాయంకాలం పచారుచేస్తుండగా ఒక ఎండు చెట్టు మొదట్లో కూర్చుని ఉన్న ముసలిది, "ఎందుకు తల్లీ, అంత విచారంగా ఉన్నావు?" అన్నది.



కాపు కూతురు ముసలిదానితో అంతా చెప్పేసింది.

"నేను చెప్పినట్టు చేస్తివా నీకు గండం గడుస్తుంది, సుఖపడిపోతావు. నిన్ను రాజు గారు పెళ్ళికూతుర్ని చేసేటప్పుడు కొన్ని వరాలు కోరు; ఒక దానిపైన ఒకటిగా, నీకు పది తెల్ల పట్టు పావడాలు కట్టాలను. తరవాత నీ పడక గదిలో ఒక తొట్టెలో సున్నపు నీరూ, ఇంకో తొట్టెలో పాలూ ఉంచాలను. వాటితోబాటు ఒక పది పేప బెత్తాలు కూడా కావాలను. ఈ కోరికలు తీర్చకపోతే పీటల మీద కూర్చోనని చెప్పు. పెళ్ళయినాక నిన్నూ, ఆ పామునూ గదిలోకి పంపుతారు. పాము నిన్ను పావడా విప్ప మంటుంది. ఒక కూసం విడిస్తేనే గాని విప్పనను. ఇలా పాము నిన్ను పావడా విప్ప మన్నప్పుడల్లా కూసం విడవమను. పాముకు ఏ డెనిమిది కూసాల కన్న ఉండవు. అది ఇంక కూసం విడవలేని దశకు వచ్చాక, పేప బెత్తం ఒకటి తీసుకో. దాన్ని సున్నపు నీటిలో ముంచి పామును ఒళ్ళంతా హూనమయేటట్టు బాదు. ఒక బెత్తం విరిగితే ఇంకో బెత్తం తీసుకో. పాము తల నుంచి తోకదాకా మాంసం ముద్ద అయి పోయి కదలలేని స్థితిలో ఉన్నప్పుడు దాన్ని ఎత్తి పాలతొట్టెలో ముంచి బాగా కడుగు.



ఆ తరవాత ఏం జరిగేదీ నీకే తెలుస్తుంది," అన్నది ముసలిది.

కాపు కుమార్తె ముసలిది చెప్పినట్టే చేసింది. అంతా ముసలి దన్నట్లే జరిగింది. పడక గదిలోకి రాగానే పాము భయంకరంగా బుసపెట్టి, "పావడా విప్పు!" అన్నది కాపుకూతురుతో.

"నువు ముందు ఒక కూసం విడు!" అన్నది కాపు కూతురు. పాము ఆమె కేసి ఎంత కోపంగా చూసిందంటే అది తనను మింగేస్తుందని ఆమె భయపడింది. కాని పాము నేల మీద యాతనపడి మెలికలు తిరిగి ఒక కూసం విడిచింది.

కాపు కూతురు ఒక పావడా విప్పి కూసం మీద పెట్టింది.

ఏ డెనిమిది కూసాలు విడిచిన మీదట పాము ఎంత ప్రయత్నించి కూడా మరొక కూసం విడవలేక పోయింది. ఆ దశలో కాపు కూతురా పామును సున్నపు నీటిలో ముంచిన బెత్తాలతో నజ్జు నజ్జుగా బాదింది. పాము బాధతో మెలికలు తిరిగిపోయింది. అది కదలలేకుండా పోయాక ఆమె దాన్ని పోగుచేసి పట్టి ఎత్తి పాల తొట్టెలో వేసింది. మరుక్షణం ఆవలిస్తూ, ఒళ్లు విరుచుకుంటూ ఒక నవమన్మధుడులాటి యువకుడు పాల తొట్టెలో లేచి నిలబడ్డాడు. తూలుతూ పడబోతున్న ఆ కుర్రవాణ్ణి కాపు కూతురు మంచం దగ్గిరికి నడిపించుకు వచ్చింది. అతను దాని పైన సొమ్మసిల్లి పడిపోయి గాఢ నిద్రపోయాడు.

మర్నాడు రాచనగరులో కాపు పిల్ల సాధించిన ఘన కార్యం నగరమంతటా తెలిసింది. రాజు తన పెద్ద కొడుక్కూ, అతడి భార్యకూ వైభవంగా రాజ్యాభిషేకం చేశాడు. రాజు రెండో కొడుకు తన వదినెగారి కన్న గొప్ప భార్యను పెళ్ళాడటం ఇష్టంలేక, కాపు రెండో కూతుర్ని పెళ్ళాడేశాడు. అందరూ సుఖంగా ఉన్నారు.





# స్వర్గారోహణం

పూర్వం అంగిరసుడనే మునికి భౌతిక దేహంతోనే స్వర్గానికి వెళ్ళాలని కోరిక కలిగింది. యజ్ఞం ద్వారా మనుష్యులు సాధించలేని కోరిక ఉండదు. గనక, ఈ కోరిక కూడా ఏదో ఒక యజ్ఞం ద్వారా తప్పక సఫలమయి తీరుతుందని ఆయన అనుకున్నాడు. కాని ఆ యజ్ఞం చేసే విధానం ఆయనకు తెలియదు. అది దేవతలకు మాత్రమే తెలిసి ఉంటుంది.

మనుష్యుల కోర్కెలను తీర్చగల వారు దేవతలే గనక ఆయన దేవతలకు రాజైన ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేశాడు. త్వరలోనే ఇంద్రుడు ప్రత్యక్షమై ఆయన కోరిక ఏమిటని ప్రశ్నించాడు.

బొందెతో సర్గానికి వెళ్ళటందుకు గాను ఎలాటి యజ్ఞం చెయ్యవలసి వుంటుందో చెప్పమని, అంగిరసుడు ఇంద్రుణ్ణి అడిగాడు. ఇంద్రుడా యజ్ఞం చేసే విధానాన్ని గురించిన వివరాలన్నీ, అంగిరసుడికి తెలిపి, అందుకు అవసరమైన మంత్రాన్ని కూడా ఆయనకు ఉపదేశించాడు.

తరవాత ఇంద్రుడు అంగిరసుడితో, "ఈ రహస్యం నానుంచి నీవు తెలుసుకున్నందుకు నిన్ను అభినందిస్తున్నాను. నీమూలంగా ఇది ఇతర మానవులకు తెలిస్తే నేను సంతోషిస్తాను. అయితే ఇది మానవులందరికీ సులభ సాధ్యమైన యజ్ఞం కాదు. ఉదారబుద్ధి కల వారికే ఇది ఫలిస్తుంది. అలాటి వారు కొద్దిమంది భౌతిక శరీరాలతో స్వర్గానికి రావటం వల్ల స్వర్గానికే లోటూ ఉండదు," అని చెప్పి అంతర్ధానమయాడు.

అయితే అంగిరసుడు ఉదారబుద్ధి కలవాడు కాడు, అసూయాపరుడు. బొందెతో స్వర్గానికి పోయే యజ్ఞం యొక్క రహస్యం తానే సంపాదించుకున్నాడు గనక దానివల్ల ఇతరులకు లాభం ఉండగూడదని ఆయన



అనుకున్నాడు. ఈ యజ్ఞ విధానం ఇతరు లకు తెలియకూడదు. తన లాగే ఇతరులు కూడా భౌతిక శరీరాలతో స్వర్గానికి పోతే తన ఆధిక్యత ఏముంటుంది?

అందుకని ఆయన సముద్ర తీరాన ఒక నిర్జన ప్రదేశాన్ని ఎంచుకుని అక్కడ యజ్ఞం ప్రారంభించాడు. భూమి ఉన్న వైపు నుంచి ఎవరూ వేదికను సమీపించకుండా తన ఇద్దరు శిష్యులనూ కొంత దూరంలో కాపలా ఉంచి, పైవాళ్ళ నెవరినీ యజ్ఞ స్థలం కేసి రానివ్వ వద్దన్నాడు. యజ్ఞ సంబారా లన్నిటినీ దగ్గిర ఉంచుకుని, యజ్ఞ మారంభించాడు.

యజ్ఞారంభంలో ఇవ్వవలసిన దానాలను తన శిష్యులకే ఇచ్చాడు. యజ్ఞ ఫలం ఎలాటిదో ఆ శిష్యులకు కూడా తెలియదు. శిష్యులు అడిగితే, "యజ్ఞ ఫలితాన్ని మీరే కళ్ళారా చూస్తారు. అప్పుడు నా ప్రతిభ మీకు తెలిసివస్తుంది. దాన్ని మీరు లోకానికి వెల్లడి చేయాలి. తెలిసిందా?" అన్నాడు ఆంగిరసుడు.

ఈ యజ్ఞానికి నేతితో తడిపిన పురోడాశా లనే పిండిరొట్టెలు హోమం చెయ్యాలి. ఆంగిరసుడు ఒక్కొక్క పురోడాశాన్నీ హోమం చేస్తుంటే అగ్నీ, ధూమమూ ఆకాశంలోకి ఇంకా ఇంకా ఎత్తుగా లేచాయి. ఆ పొగ మధ్యగా ఒక కాంతివంతమైన విమానం క్రమంగా కిందికి దిగివస్తూ కన బడింది. యజ్ఞం అంతమవుతున్న కొద్దీ అది నేలను సమీపిస్తున్నది. హోమం చెయ్య వలసిన పురోడాశం ఇంకొక్క టున్నది; అలాగే విమానం కూడా ఇంకా కొద్దిగా దిగి రావలిసి ఉన్నది.

సరిగా ఆ క్షణంలో ఒక అవాంతరం వచ్చిపడింది. ఆ చుట్టు పక్కల ఆశ్రమా లలో ఉండే మునులు ఆకాశంలోకి లేచే ధూమాన్ని చూసి, ఎవరో యజ్ఞం చేస్తు న్నట్టు గ్రహించారు. యజ్ఞాలు జరిగే చోటికి

మునీశ్వరులు యథేచ్ఛగా వెళ్ళవచ్చు, యజ్ఞ శేషాలూ భుజించవచ్చు. అందుకు అహ్వానాలు అవసరం లేదు. అందు చేత అన్ని పక్కల నుంచీ మునులు యజ్ఞం జరిగే చోటికి ఉత్సాహంగా బయలుదేరి వచ్చారు. ఆ మునులను అంత దూరానే చూసి శిష్యులు, "మునులు వస్తున్నారు!" అని కేక వేసి గురువుకు చెప్పారు.

"వాళ్ళను రానివ్వకండి. పొమ్మని చెప్పండి," అని శిష్యులకు కేకపెట్టి ఆంగిరసుడా తొందరలో ఆఖరు పురోడాశానికి ఒక పక్కనే నెయ్యి రాచి హోమం చేశాడు. దీనితోబాటు ఆయన మంత్రం చదవటం కూడా మరిచాడు. కాని తాను చేసిన పొరపాటును గ్రహించక, గాలిలో అంత ఎత్తున ఉన్న విమానాన్ని ఎగిరి అందుకుని, దాని అంచును పట్టుకున్నాడు.

విమానం కొంచెం పైకి వెళ్ళి అక్కడే గుండ్రగా తిరగసాగింది.

విమానంలో ఉన్న దేవత ఆంగిరసుడితో, "యజ్ఞం సంపూర్తి కాలేదు, ఆ కారణం వల్ల నీవు విమానంలో ఎక్కటానికి వీల్లేదు," అన్నాడు.

"యజ్ఞ విధి సక్రమంగా పూర్తి చేశాను. ఎక్కించుకో!" అని ఆంగిరసుడు దేవతను బతిమాలాడు.



ఈలోపుగా, అగ్నిలో వేల్చిన అఖరు పురోడాశం నుంచి పొగలు లేచి ఒక భూతం ఆకారం దాల్చాయి. ఆ భూతం విమానం చూట్టూ తిరగసాగింది.

కింద చేరిన మునులు, "ఎవరు నువ్వు?" అని అడిగారు. భూతం జవాబు చెప్పక పైకి పోసాగింది. ఇంద్రుడిపైనా, బృహస్పతిపైనా అంకపెట్టి, మునులా భూతాన్ని కిందికి రమ్మన్నారు. అది రాలేదు. అగ్నిపై అంక పెట్టగా అది దిగి వచ్చింది.

"నేను పురోడాశాన్ని. అగ్ని కోసం పుట్టిన దాన్ని. నన్ను సమంత్రకంగా అగ్నిలో హెూమం చెయ్యండి. అంగిరసుడలా చేయకపోవటం చేత నేనీ రూపం ధరించాను. మించిపోయిందేమీ లేదు. ఇప్పటికైనా నన్ను సక్రమంగా హెూమం చెయ్యండి," అన్నదా భూతం.

కాని ఆ మంత్రం వారికి రాదు. విమానాన్ని పట్టుకుని వేళ్ళాడుతున్న అంగిరసుడు వారితో, "మునులారా, నేను భౌతిక దేహంతో స్వర్గానికి పోగోరి ఈ యజ్ఞం చేశాను. తొందరలో పురోడాశాన్ని తప్పుగా హెూమం చేశాను. దానికి రెండవ పక్క కూడా నెయ్యి రాచి, నేను చెప్పే మంత్రం చదువుతూ హెూమం చెయ్యండి," అని ఆ మంత్రం మునులకు చెప్పాడు.

వారలాగే ఆ భూతాన్ని హెూమం చేశారు. అగ్ని జ్వాలలు ఆకాశంలోకి లేచాయి. విమానంలోని దేవత, "అంగిరసుడా, యజ్ఞ భంగమయింది. ఈ దేహంతో నీవు స్వర్గాన్ని చేరే అవకాశం లేదు. దివ్యదేహం ధరించిరా!" అన్నాడు.

అంగిరసుడు యజ్ఞ గుండంలో దూకి దివ్య దేహంతో స్వర్గానికి చేరుకున్నాడు.

అంగిరసుడి సంకుచిత బుద్ధి కారణంగా భూలోకంలోని వారికి భౌతిక దేహంతో స్వర్గానికి వెళ్ళే విధానం దొరకకుండా పోయింది.





# తగని కోరిక

సురపురం దేశపు రాజు ధర్మదత్తుడు విద్యాభిమాని, కళాపోషకుడు, బుద్ధిశాలులైన మంత్రుల సలహాతో చక్కగా రాజ్యమేలుతూ వచ్చాడు.

ఒకనాడు శౌచమిత్రు డనే చిత్రకళా ప్రవీణుడు రాజదర్శనం చేసి, తను వేసిన చిత్రాలన్నీ రాజుకు చూపించాడు.

ధర్మదత్తుడు చాలా ముచ్చటపడి, అతని చిత్రాలను తీసుకుని, అయిదు వేల వరహాలు బహూకరించాడు.

బహుమతి పొందిన శౌచమిత్రుడు, "ప్రభూ!—దీనితో నాకు తృప్తి లేదు. అనుజ్ఞ దయచేయిస్తే ఏలిక చిత్రాన్ని చిత్రించి, నా ప్రజ్ఞ చూపించాలని కుతూహలంగా వుంది," అంటూ మనవి చేశాడు.

రాజాజ్ఞ అయింది. పది పదిహేను రోజులలో ప్రభు చిత్రాన్ని తయారు చేశాడు, శౌచమిత్రుడు. దర్బారులో ప్రదర్శించిన ఆ చిత్రాన్ని అందరూ మెచ్చుకున్నారు. ధర్మదత్తుడి సంతోషానికి మేర లేదు.

"నువు మా ఆస్థానంలో ఉండవలసిన చిత్రకారుడివి. నెలకు పదివేలు వరహాల పారితోషికం," అన్నాడు రాజు.

"మహారాజా!—వృత్తిచేత నేను చిత్రకారుణ్ణి. కనుక దానిలో ఎంతటి ప్రతిభ చూపినా గొప్ప లేదు. అంతకంటె విశేషమైన..." అని ఊరుకున్నాడు శౌచమిత్రుడు.

అతడి వుద్దేశ మేమిటో బోధపడక, "నీకు కావలసింది నిస్సంకోచంగా అడుగు, ఇస్తాము," అన్నాడు రాజు.

అందుకు చిత్రకారుడు, "ముఖ్యమంత్రిగా తమ సాన్నిధ్యంలో ఉండాలని కోరిక," అని చెప్పాడు.

ముఖ్యమంత్రి అయిన ధీమంతుడి ముఖం చూచాడు రాజు, సంశయించక సమ్మతి ఇమ్మని సైగ చేశాడు ధీమంతుడు.

ఎం. సర్వేశ్వరరావు




అప్పుడు రాజు ధీమంతుణ్ణి చూసి, "మహామంత్రీ, ఇటు పైన మీ పదవిని చిత్రకారుడైన ఈ శౌచమిత్రుడి కిస్తున్నాము. కనుక ఈ క్షణం నుంచీ మీరు విరమించుకో వచ్చు," అన్నాడు.

మంత్రి ధీమంతుడు ప్రభువుకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంకాలం రాజు వాడుక ప్రకారం వాహ్యాళికి బయల్దేరాడు. రాజు వెంట మంత్రి శౌచమిత్రు డున్నాడు.

ధర్మదత్తుడు కొత్త మంత్రితో అదీ యిదీ మాటాడుతూ, ఒక కొలను వద్దకు వచ్చాడు. ఆ పక్కనే దేవాలయం దగ్గిర ఒక ఇంటి అరుగుపై కూర్చున్న వృద్ధుడు రాజుకు నమస్కరించాడు.

అప్పటివరకూ కాకులకు గింజలు వేస్తున్న ఆ వృద్ధుణ్ణి చూసి, "ఏమయ్యా, కాకులంటే నీ కిష్టమా? వాటికి బదులు హంసల్ని పెంచకూడదూ? పోనీ, నే నొక హంసను పంపిస్తాను. అప్పుడేం చేస్తావు?" అని అడిగాడు రాజు.

"అది నిజమైన హంస అవునా కాదా అని ముందు చూస్తాను. నిజమైనది కాక పోతే, ఏదో మర్యాదకు ఒకటి వుంచి మిగత రెక్కలన్నీ ఊడబెరికి, కాకిగా చేసి మీ దగ్గరకే పంపేస్తాను," అన్నాడా వృద్ధుడు.

"ఏదైనా మూట జీర్ణించుకో గలవాడివేనా నువ్వు?" అనడిగాడు రాజు.

అందుకు వృద్ధుడు, "దూర ప్రయాణం లోనే ఆహారం మూట అగత్యం వస్తుంది," అని చెప్పాడు.

"తరవాత ఆ మూటను ఏంచేస్తావు?" అంటూ మళ్ళీ ప్రశ్న వేశాడు, రాజు.

"మూటలో ఏమైనా మిగిల్తే కద? అదెప్పుడో ఖాళీ అయిపోతుంది," అని వృద్ధుడి జవాబు.

తరువాత "నీ ఇల్లు బాగుందా?" అన్నాడు రాజు.

"నా యింటి గొడవ దేనికి? మీ ఎదురిల్లు ఖాళీ అయింది. ఆ సంగతి తెలుసుకోండి," అని చెప్పాడు వృద్ధుడు.

అప్పుడు రాజు, "చూడగా నువు చాలా బుద్ధిమంతుడి లాగా ఉన్నావే. నా దగ్గిర ఈయలేని తీయలేని రెండు మణులు న్నాయి. ఆ రెండు మణులతో రెండు దిక్కు లనూ ప్రకాశింపజేయటానికి సాధ్యమవు తుందా?" అని ప్రశ్నించాడు.

దానికి వృద్ధుడు, "సాధ్యపడదే. ఒక్క మణితో ఎంత ప్రకాశం కలుగుతుందో, రెండింటితోను ఒకే దిక్కున అదే ప్రకాశం వుంటుంది," అంటూ బదులు చెప్పాడు.

ధర్మదత్తుడు మంత్రితో సహా ఇంటి దారి పట్టాడు. ఇక రాజభవనం సమీపిస్తుందనగా మంత్రిని చూసి, "మా సంభాషణలు విన్నావు కదా, వాటి అర్థం ఏమిటో చెప్ప గలవా?" అని అడిగాడు.

అందుకు శౌచమిత్రుడు, "ప్రభూ!— అవేమిటో నాకు ఒక్కటీ బోధపడలేదు. అంతా అయోమయంగా తోచింది. మీ ఉభయులూ ఏదో తమాషాగా మాటాడు కున్నారేమో అనుకున్నాను," అన్నాడు.

"మహామంత్రివై ఉండీ, ఇదే బోధపడ లేదంటే ఎలా? నువు కొత్తగా మంత్రి అయావు గనుక ఒక రోజు వ్యవధి ఇస్తాను.





యోచించు, అదే తెలుస్తుంది," అన్నాడు రాజు. సరే నంటూ శౌచమిత్రుడు బస చేరు కుని, రాత్రంతా యోచించాడు. తేలలేదు. తెల్లారగానే ఆ వృద్ధు డింటికి పోయి, అతన్ని చూసి, "అయ్యా, దయచేసి నిన్న రాజుకూ నీకూ జరిగిన సంభాషణల అర్థం చెప్పాలి," అని అడిగాడు.

"అలాగే చెబుతా, నాయనా. అయితే, నే నీ వృత్తిలోనే జీవించేవాణ్ణి గనక, ఒక్కొక్క ప్రశ్నకు ఒక్కొక్క వేయి చొప్పున ఐదు ప్రశ్నలకూ ఐదువేల వరహాలు ఇవ్వాలి. నీకు గాను ఒక్క వేయి తగ్గిస్తాను. ముందు డబ్బు తీసుకురా!" అన్నాడు వృద్ధుడు.

శౌచమిత్రుడు ఇంటికి పోయి నాలుగు వేల వరహాలూ మూటకట్టి తెచ్చి వృద్ధుడి కిచ్చాడు. అప్పుడు వృద్ధుడు ఇలా చెప్పాడు:

"రాజుగారు మొదటి ప్రశ్నగా, 'ఒక హంసను పంపిస్తే ఏం చేస్తా?' వని అడి గారు. 'నిజమైన హంస అవునా కాదా అని చూస్తాను. నిజమైనది కాకపోతే రెక్కలన్నీ పీకి, మర్యాద కొకటుంచి మీ దగ్గరకే పంపిస్తా' నని నే నన్నాను. ఇది అటుంచు. చివరకు తెలుస్తుంది.

"ఇక రెండో ప్రశ్న: 'ఏదైనా మూట జీర్ణించుకుంటావా?' అని. ప్రయాణకాలంలో ఆహారపు మూట కావలసి వస్తుందని నా జవాబు. మూడవది: 'తర్వాత ఆ మూటను ఏం చేస్తావు?' అని. దానికి నే చెప్పిన సమాధానం: 'ఇంకొకరిని అడిగి తెలుసు కునే వాడి బుద్ధి అప్పటిమట్టుకే ఉపకరి స్తుంది. అలాగే ప్రయాణ కాలపు ఆహారం మూట తత్కాలానికే పనికివచ్చి, తరువాత అంతటితో ఖాళీ అయిపోతుంది.'

"నాలుగో ప్రశ్న: 'నీ యిల్లు బాగుందా?' అని. దానికి 'మీ ఎదురిల్లు ఖాళీ అయింది. ఆ సంగతి తెలుసుకోండి,' అన్నాను నేను. అంటే, 'మీ ఎదురుగానే ముఖ్యమంత్రి స్థానం ఖాళీ అయిందికదా అని నా సూచన.

"రాజుగారు అడిగిన ఐదో ప్రశ్న: రెండు మణులను గురించి. దానికి నేను కళ్ళు రెండున్నా దృశ్యం మటుకి ఒకటిగానే కనిపిస్తుందని చెప్పాను.

"ఇంకిప్పుడు మొట్ట మొదటి ప్రశ్నకు వద్దాం: రాజుగారు పంపిస్తానన్న హంసవు నువ్వే. నే నడిగిన వెంటనే నువ్వు నాలుగు వేల వరహాలూ పట్టుకు వచ్చావు. అంటే నీ దగ్గిర ఇంకా కొంచం మిగిలే వున్నదన్న మాట. 'నిజమైన హంస కాకపోతే రెక్క లన్నీ పీకి, మర్యాద కొక టుంచి, కాకిగా చేసి మీ దగ్గరకే పంపిస్తా' నని నేను చెప్పిన సమాధానం గ్రహించే ఉంటావు," అన్నాడు. ఈ ప్రశ్నోత్తరాలు తనను గురించేనని తెలిసి, శౌచమిత్రుడి ముఖం చిన్నబోయింది. తిన్నగా వెంటనే రాజదర్శనానికి వెళ్ళాడు.

"ప్రభూ!—అన్నీ గ్రహించాను, కళ్ళు తెరుచుకున్నాను. దయచేసి మంత్రి పదవి తిరిగి తీసుకోండి. నాకు అర్హత లేదు," అన్నాడు శౌచమిత్రుడు. తను తెలుసుకు వచ్చిన సమస్యల అర్థాన్ని విప్పి చెప్పి, క్షమాపణ కోరుకున్నాడు.

"ఇన్ని తెలుసుకున్నవాడివి, ఆ వృద్ధు డెవరో తెలుసుకున్నావా?" అని అడిగాడు ధర్మదత్తుడు.

లే దన్నాడు శౌచమిత్రుడు.

"అదీ ఒక సమస్యే నన్నమాట. 'ఈ వృత్తిలోనే జీవించేవాడి'నని చెప్పాడుకద. బుద్ధిబలమే ఆ వృత్తి. మంత్రిగా ఉండే వానికి బుద్ధిబలం ప్రధానం. ఆయనే నీకోసం మంత్రి పదవి వదిలి వెళ్ళిన వృద్ధ మంత్రి ధీమంతుడు. ఈ ప్రశ్నకు జవాబు నేను చెప్పాను గనుక, ఆయన నీకు మిగిల్చిన వేయి వరహాలూ నాకు రావాలికద?" అంటూ రాజు నవ్వాడు.

"నిజమే ప్రభూ! తప్పక ఇస్తాను. ఈ ధనంతో నేను అమూల్యమైన పాఠం నేర్చు కున్నా," నన్నాడు శౌచమిత్రుడు.





# పరీక్షా ఫలితం

సింధుదేశాన్ని మలయకేతు మహారాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయన ఏక పుత్రిక వనజముఖి పరమ సుందరిగా కీర్తికెక్కింది. ఆమెను పెళ్ళాడాలని అనేక మంది రాజ కుమారులు వచ్చారు గాని, రాజకుమారి పెట్టిన పరీక్షలో నెగ్గలేకపోయారు. ఈ పరీక్ష గురించి వాడవాడలా తెలిసిపోయింది.

తనను పెళ్ళాడేవాడు ధైర్యవంతుడూ, వీరుడూ, యుక్తిపరుడూ అయి ఉండాలనే ఉద్దేశంతో రాజకుమారి ఈ పరీక్ష ఏర్పాటు చేసింది. ఆమె వచ్చిన వారి నందరినీ పరీక్షకు పెట్టలేదు; వారి వయసూ, అంద చందాలూ తనకు నచ్చిన మీదటనే ఆమె వారికి పరీక్ష ఇచ్చింది.

ఆ పరీక్ష ఈవిధంగా ఉన్నది:

రాజభవనానికి ఉత్తరాన ఒక తోటా, దానికి ఉత్తరాన చిన్న అరణ్యమూ ఉన్నాయి. ఆమెను పెళ్ళాడ గోరినవాడు ఆ అరణ్యంలో ప్రవేశించి, అందులోకుండా రాజభవనానికి రావాలి. అరణ్యంలో ఒక పులి ఉన్నది. దాన్ని నిరాయుధుడై జయించి ముందుకు వచ్చి, తోటలో ప్రవేశించాలి. ఆ తోటలో ఒక భయంకరమైన పక్షి ఉన్నది; అది ఎవరినన్నా చూడగానే మీదికి వచ్చి కళ్ళు రెండూ పొడిచేస్తుంది. దాన్నికూడా తప్పించుకుని రాజభవనం కేసి వస్తే, తోటకూ, రాజభవనం ఆవరణకూ మధ్యగా ఒక బురద కందకం ఉన్నది. అందులో గొంతు లోతు బురద ఉంటుంది. ఆ కంద కంలోకి దిగి రాజభవనం చేరుకోగానే, రాజ కుమార్తె తన స్వహస్తాలతో లోటాడు నీళ్ళి స్తుంది. ఆ లోటాడు నీళ్ళతోనే బురద అంతా పోయేలాగు కడుక్కోవాలి. ఈ పరీ క్షలో నెగ్గినవాణ్ణే ఆమె పెళ్ళాడుతుంది.

ఆమెను పెళ్ళాడ వచ్చిన వారిలో కొందరు పులి చేత చచ్చారు. మరి కొందరు పులి

బి. లక్ష్మణాచారి

బారి నుండి తప్పించుకుని, భయంకర పక్షి మూలాన కళ్ళు పోగొట్టుకున్నారు. పులినీ, పక్షినీ జయించి బురదలో దిగి వచ్చినా, లోటాడు నీటితో ఒళ్ళంతా కడుక్కోవటం ఎలా సాధ్యమవుతుంది?

ఈ అసాధ్యమైన పరీక్ష గురించి నగావళీ రాజకుమారుడు ప్రతాపుడనేవాడు విన్నాడు. అతను సింధుదేశపు రాజధానికి వచ్చి, రాజ భవనానికి ఉత్తరాన ఉన్న అరణ్యాన్ని ఒక సారి చుట్టి వచ్చాడు. అరణ్యం చుట్టూ బలమైన కంచె వేసి ఉన్నది. ఆ కంచెలోనే ఉత్తర భాగంలో ఒక ద్వారమున్నది. చుట్టూ కంచె ఉండటమే గాక, రాజభవనానికి దగ్గిరిగా కూడా ఉన్నందున, ఆ అరణ్యం సహజమైనది కాదనీ, కృత్రిమమైనదనీ, అందులో ఉండే పులి కూడా మనుషులు పెంచేదే అయి ఉంటుందనీ అతను ఊహించాడు.

తరవాత ప్రతాపుడు రాజకుమార్తెను సందర్శించాడు. అతను పరీక్షకు నిలబడటానికి ఆమె సమ్మతించింది. ఎందుకంటే అతను యువకుడూ, అందగాడూనూ. అతను మనిషి ముఖాన్ని పోలి ఉండేటట్టుగా ఒక ముఖ కవచం చేయించుకున్నాడు. అది ధరించినట్టయితే, కళ్ళూ, ముక్కూ, గడ్డమూ, నుదురూ మొదలైన



వాటితో కూడి, అచ్చుగా మనిషి ముఖాన్ని పోలి ఉంటుంది; కాని అది లోహంతో చేయబడినది. ఈ కవచాన్ని చంకన పెట్టుకుని, చేతిలో మాంసం మూటగట్టి పట్టుకుని, ప్రతాపుడు ఉత్తర ద్వారం కుండా అరణ్యంలో ప్రవేశించాడు.

అరణ్యంలో అతను కొద్ది దూరం వెళ్ళే సరికి గాండ్రిస్తూ పులి ఎదురయింది. అతను మాంసం మూట విప్పి పులిముందు పడేసి తన ముఖానికి కవచం ధరించుకుని ముందుకు సాగాడు. పులి మాంసం తినటంలో నిమగ్నమై పోయి అతని గొడవే పట్టించుకోలేదు.

ప్రతాపుడు అరణ్యం దాటి తోటలో ప్రవేశించగానే భయంకర పక్షి వచ్చి, అతని ముఖ కవచంలోని కళ్ళను పొడిచి తన దారిన తాను పోయింది. అతను ముఖ కవచాన్ని తీసి దూరంగా పారేసి, తోటకూ రాజభవనం ఆవరణకూ మధ్య ఉండే బురద కందకంలోకి దిగి, పైకి వచ్చి, రాజభవనాన్ని చేరుకున్నాడు.

రాజకుమారి లోటాడు నీళ్ళతో సిద్ధంగా ఉన్నది. ప్రతాపు డామెతో, "ఈ పరీక్షలో రెండు అంశాలలో నెగ్గాను. ఈ మూడవ దానిలో నెగ్గించే బాధ్యత అంతా నీ పైన ఉన్నది," అన్నాడు.

"ఈ లోటాడు నీటితో ఒంటి బురద అంతా కడుక్కోవలిసినవాడవు నీవేగదా?" అన్నది రాజకుమారి.

"అలాగే కడుక్కుంటాను. కాని ఆ నీరు పొయ్యవలిసిన పని నీది. జాగ్రత్త, ఒక్క చుక్క కూడా నేలపై పడకూడదు. అలా పడిన ప్రతి చుక్కకూ ఒక్కొక్క బిందెడు నీరివ్వవలిసి ఉంటుంది," అన్నాడు ప్రతాపుడు.

"పరీక్షలో నెగ్గావులే. స్నానం చేతువుగాని పద!" అన్నది రాజకుమారి. తరవాత వారిద్దరికీ వైభవంగా పెళ్ళి జరిగింది.





# ధర్మనిధి

పాపన్న ఉండే ఊరి గ్రామాధికారి తన పెరడులో బావి తవ్వించగోరి ఒక గొప్ప క్షేత్రజ్ఞుణ్ణి పిలిచి, ఆ స్థలంలో బావి తవ్వితే మంచినీరు పడుతుందేమో చెప్పమన్నాడు.

క్షేత్రజ్ఞుడా పెరడు చూసి, "అయ్యా, మీరు మంచి నీటి మాట అడుగుతున్నారేమిటి? ఇక్కడ నాలుగు నిలువుల లోతున పెన్నిధి ఉన్నది. అయితే అది సులువుగా దొరకదు. గజలక్ష్మి పూజా, నాగ పూజా చెయ్యాలి. ఒక మాసం కఠిన ఉపవాసం చెయ్యాలి," అన్నాడు.

ఈ మాట విని గ్రామాధికారి లోలోపల సంతోషించి, పైకి మాత్రం క్షేత్రజ్ఞుడితో, "అమ్మయ్యో, ఆ వ్రతాలూ, పూజలూ, ఉపవాసాలూ నేనెక్కడ చెయ్యగలను? మీ దయవల్ల దేవుడే లోటూ లేకుండా ఇంత ఇచ్చాడు. అయినా ముందు రాబోయే వాళ్ళకైనా అవసరంపడితే పనికివస్తుంది; అందు చేత మీరీ మాట చెప్పింది మంచిదే అయింది," అని ఆయనకు కొంత డబ్బు ముట్టచెప్పి పంపేశాడు.

తరవాత గ్రామాధికారి పురోహితుణ్ణి పిలిపించి, "ఏమయ్యా, నాకు గ్రహచారం సరిగా లేదనీ, పెద్ద ఉపద్రవాలూ, నష్టాలూ రానున్నాయనీ జ్యోతిష్కు లంటున్నారు. గజలక్ష్మి వ్రతమూ, నాగపూజా చేస్తే అవి నివారణ అవుతాయట. అవి ఎలా చెయ్యాలి? వాటి తంతేమిటి? అందు కెంత ఖర్చవుతుంది?" అని అడిగాడు.

"చిత్తం. గజలక్ష్మి వ్రతం చేస్తే సంపద సిద్ధించే మాట నిజం. అందుకుగాను ఒక నెలపాటు నిరాహారంగానూ, నిష్ఠగానూ ఉండాలి. అర్థరాత్రి వేళ నాగ పూజ చేయాలి. తెల్లవారుజామున మూడు గుక్కలు పాలు తాగి, దంపతీ సహితంగా లక్ష్మి పూజ చెయ్యాలి. చాలా కఠిన వ్రతం.



ఖర్చుదేమున్నది లెండి? ఒక వెయ్యికి మించదు," అన్నాడు పురోహితుడు.

ఈ వివరాలు విని గ్రామాధికారి తెల్ల మొహం వేశాడు. ఆయన ఎన్నడూ ఉపవాసాలు చేసినవాడు కాడు. భోజన ప్రియుడు కూడానూ. మిగిలిన వాళ్ళకు ఉన్నా లేక పోయినా, తన మట్టుకైనా మంచి మంచి పంటకాలు చేయించుకుని, ముప్పూటలా తృప్తిగా భోంచేసేవాడు.

"ఈ వ్రతం మన వల్ల అవుతుందా?" అన్నాడు గ్రామాధికారి.

ఆ మాట వినగానే పురోహితుడికి భయం వేసింది, తనకు వచ్చే డబ్బు కాస్తా పోతుం దేమోనని. గ్రామాధికారి ఈ వ్రతం చేసి నట్టయితే ఒక్క దెబ్బన పురోహితుడి దారిద్ర్యం తీరిపోతుంది. అందుచేత ఆయన గ్రామాధికారితో, "దీక్ష మీరే పట్టాలన్న నియమం లేదే. ఆ పని మరే దంపతులు చేసి వ్రతం సాగించినా, అందుకయే ఖర్చంతా మీరే భరించే పక్షంలో వ్రతఫలం విధిగా మీకే చెందుతుంది గద!" అన్నాడు.

గ్రామాధికారికి చప్పున పరోపకారి పాపన్నా, అతని భార్యా గుర్తుకొచ్చారు. వాళ్ళు ఫలాపేక్ష లేకుండా ఎవరికి ఏ ఉపకారం చెయ్యమన్నా చేస్తారు. వ్రతం పూర్తి అయాక వారికి తృణమో పణమో ముట్ట జెప్పినా తనకు పెద్ద నష్టమేమీ ఉండదు. వ్రతానికి అవసరమైన ఏర్పాట్లు చేస్తానని చెప్పి పురోహితుణ్ణి పంపేసి, గ్రామాధికారి పాపన్న ఇంటికి వెళ్ళి, "పాపన్నా, నీ వల్ల నా కొక ఉపకారం కావలిసి ఉంది, ఏమంటావు?" అన్నాడు.

"ఏమిటో చెప్పండి. తప్పక చేస్తాను," అన్నాడు పాపన్న.

"నీవూ, నీ భార్యా నెల రోజులపాటు మా ఇంట ఉండి ఉపవాసం చేస్తూ గజ లక్ష్మి వ్రతమూ, నాగపూజా జరిపించాలి," అన్నాడు గ్రామాధికారి.

పాపన్న సరేనన్నాడు. పురోహితుడు ఏ రోజున వ్రతాచరణ ప్రారంభం కావలిసిందీ నిర్ణయించాడు. పాపన్నా, మీనాక్షీ ఆనాడు గ్రామాధికారి ఇంటికి వెళ్ళి వ్రత దీక్ష పూనారు. వారు నెల రోజులపాటు పురోహితుడు చెప్పిన విధులన్నిటినీ తూచా తప్పకుండా నిర్వర్తిస్తూ, ఉపోషాలు చేసి వ్రతం పూర్తి చేశారు. వ్రతం చేయించిన గ్రామాధికారి సుష్టుగా భోజనం చేసి పిడిరాయిలా గున్నాడు, మంత్రాలు చదివి దక్షిణలు సంగ్రహించిన పురోహితుడు మరింత సుఖంగా నిద్రపోయి సుఖంగా ఉన్నాడు; నిద్రాహారాలు లేక పాపన్నా, మీనాక్షీ మాత్రం చిక్కి శల్యావశిష్టు లైపోయారు. వ్రతం పూర్తి అయిన మీదట గ్రామాధికారి పాపన్నకు పది రూపాయలు తాంబూలంలో పెట్టి ఇచ్చి, పంపేశాడు.

వెంటనే బావి తవ్వకం ప్రారంభమయింది. మూడు నిలువుల లోతు తవ్వేదాకా అవసరమైనంత మంది కూలీలను నియోగించి, ఆ తరవాత ఇద్దరిని ఉంచి మిగిలిన వారిని పంపేశాడు గ్రామాధికారి.

బావి నాలుగు నిలువుల లోతు వచ్చాక ఒకనాడు తవ్వేవాడి పలుగుకు ఖంగున ఏదో తగిలింది. వెంటనే గ్రామాధికారి కూలి



వాళ్ళతో, "నీరు పడకపోగా రాయి కూడా తగిలింది. ఇక మీరు పని మానెయ్యవచ్చు," అని వాళ్ళను పంపేశాడు. తరవాత తానే కష్టపడి తవ్వి ఇనప పెట్టె నొకదాన్ని పైకి తీశాడు. దాన్ని ఆయన ఆ రాత్రి శ్రమపడి ఇంట్లోకి చేర్చాడు.

పుట్టెడాశతో ఆయన దాని మూత తెరిచి చూసేసరికి కళ్ళు తిరిగి పోయాయి. దాన్నిండా రాళ్ళే! ఎవరివల్లనో లోపం జరిగి ఉంటుంది. అందుకే బంగారం దొరకటానికి బదులు రాళ్ళు దొరికాయి. లోపం ఎవరు చేసి ఉంటారు? పురోహితుడు చెయ్యడు. చెయ్యటం వల్ల అతడికి ఒరిగే దేమీలేదు.



61

పాపన్నా, కామాక్షీ ఏదో లోపం చేసి ఉంటారు. ఎప్పుడో నిష్ఠాభంగమై ఉంటుంది.

ఈ మాట అనుకుని గ్రామాధికారి పాపన్నను పిలిపించి, "నీ మూలంగా సర్వ నాశమయింది. బోలెడంత డబ్బు పోసి వ్రతం చేయిస్తే ఫలితం దక్కకుండా పోయింది. నువ్వూ, నీ భార్యా ఉపవాసాలు సరిగా చెయ్యక దొంగ తిండి తిని ఉంటారు," అని నిష్ఠురాలాడాడు.

"మీరనే దేమిటో నాకర్థం కాలేదు. మేము పురోహితుడు చెప్పినదల్లా వెంట్రుక వాసి పొర్లురాకుండా చేశాం. మీరేం వ్రత ఫలితం ఆశించారు? అది ఎలా దక్కకుండా పోయింది?" అని పాపన్న అడిగాడు.

ఇక ఏమీ దాచకుండా గ్రామాధికారి పాపన్నకు అంతా చెప్పేసి, "ఆ క్షేత్రజ్ఞుడు చెప్పినట్టే నాలుగు నిలువుల లోతున ఈ పెట్టె దొరికింది. దాన్లో నిధి ఉంటుందని ఆయన అన్నాడు. ఏముందో నువే చూడు," అన్నాడు. పాపన్న పెట్టె మూత తెరిచి చూసి, "అందులో ఉన్నది బంగారమే!" అన్నాడు.

గ్రామాధికారి ఆత్రంగా వచ్చి చూశాడు. ఆయనకు పెట్టె నిండా రాళ్ళే కనపడ్డాయి. "చేసిన మోసం చాలక నన్ను భ్రమ పెడుతున్నావు కూడానా? బంగారమైతే మీ యింటికి పట్టుకుపో!" అన్నాడాయన.

"మీ కక్కర్లేక పోతే అలాగే ఇప్పించండి," అంటూ పాపన్న ఆ పెట్టెను తన ఇంటికి తీసుకుపోయి, తనకు నిధి దొరికిందనీ దాన్ని ధర్మకార్యాలకు వినియోగించవలిసిందనీ రాజుగారికి కబురు చేశాడు. రాజోద్యోగులు వచ్చి ఆ పెట్టెను మోయించుకు పోయారు. తరవాత రాజుగారు పాపన్నకు మంచి బహుమానమూ, యోగ్యతా పత్రమూ పంపాడు.

ఇదంతా తెలిసి గ్రామాధికారి తనకు డబ్బు దొరక్కపోగా, కీర్తి అయినా దొరికిందికాదే అని చాలా విచారించాడు.






రావణుడు అశోకవనాన్ని చేరేసరికి, సీత దుఃఖంతో రాముణ్ణి గురించి ఆలోచిస్తూ, నేలపైన కూర్చుని తల వంచుకుని ఉన్నది. ఆమె చుట్టూ భయంకరాకారం గల రాక్షస స్త్రీలున్నారు. రావణుడు సీతను సమీపించి, "నీవు ఏ రాముణ్ణి చూసుకుని గర్విస్తున్నావో ఆ రాముడు యుద్ధరంగంలో చచ్చాడు. ఇక నీవు నా భార్యవు కాక గత్యంతరం లేదు. పాపం, ఆ రాముడు నన్ను చంపుదామని పెద్ద వానరసేనతో వచ్చి సముద్రపు ఉత్తర తీరాన విడిశాడు. అందరూ బడలి ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న సమయంలో మా చారులు వెళ్ళి అన్ని సంగతులూ చూసి వచ్చారు. అప్పుడు మా ప్రహస్తుడు గొప్ప రాక్షస సేనతో వెళ్ళి, వానరసేన పై అయుధాల వర్షం కురిపించి, నిద్రపోతున్న రాముడి తల నరికేశాడు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ తప్పించుకుని పారిపోయారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, అంగదుడూ మొదలైన వానర వీరులంతా చచ్చారు," అన్నాడు.

అతను ఒక రాక్షస స్త్రీతో, "రాముడి శిరస్సును యుద్ధరంగం నుంచి తెచ్చిన విద్యుజ్జిహ్వుణ్ణి రమ్మను," అన్నాడు. విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సునూ, బాణాన్నీ తెచ్చి, రావణుడి ఆజ్ఞపై వాటిని సీత ముందుంచి చప్పున వెనక్కు వచ్చేశాడు.

తన ముందున్న తలలో కళ్ళూ, జుట్టూ, చూడామణీ గుర్తించి సీత నిజంగా రాముడు



చనిపోయాడనే అనుకుని దుఃఖ సము ద్రంలో పడి కొట్టుకున్నది. ఆమె కైకేయిని తిట్టుకున్నది, తనను పెళ్ళాడటం చేతనే రాముడి కీ దురవస్థ వచ్చిందని తనను తాను నిందించుకున్నది. తన తలను రాముడి తలతోనూ, తన శరీరాన్ని రాముడి శరీరం తోనూ చేర్చమని రావణుణ్ణి వేడుకున్నది.

అంతలోనే ద్వారపాలకుడు వచ్చి రావణుడితో, ప్రహస్తుడు మొదలైన మంత్రులందరూ రావణుడి దర్శనం కోసం వేచి ఉన్నట్టు చెప్పాడు. రావణుడు బయలుదేరి సభకు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాముడి తలా, ధనుస్సూ అంతర్థానమయిపోయాయి.

విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చి ఊరడిస్తూ, "రాముడు వానర సేనతో సముద్రం దాటి దక్షిణ తీరానికి వచ్చాడు. ఆ సంగతి తెలిసే మంత్రులతో మాట్లాడటానికి రావణుడు పరిగెత్తి వెళ్ళాడు. రావణుడి మాయలు నమ్మకు," అన్నది.

రావణు డక్కడ కొలువులో సభ చేసి తన సైన్యాధ్యక్షులతో, "భేరి వేసి రాక్షస సైన్యాలను అయత్త పరచండి. కారణం చెప్పవద్దు," అన్నాడు. ఆ భేరి మోత సీతకూ, సరమకూ వినిపించింది. "చూశావా, రాక్షస సేనలు యుద్ధాని కిప్పుడే కదులుతున్నాయి," అన్నది సరమ సీతతో. సీతకు ప్రాణం లేచి వచ్చింది.

సరమ సీతతో, "కావాలంటే నే నిప్పుడే రాముడి వద్దకు వెళ్ళి, నీవు క్షేమంగా ఉన్నావని చెప్పి రాగలను. ఏమంటావు?" అని అడిగింది.

"నా కోరిక తీర్చాలని ఉన్నట్టయితే రావణు డేంచేస్తున్నాడో తెలుసుకుని రా," అన్నది సీత.

సరమ వెళ్ళి వచ్చి, "రావణుడికి అతని తల్లీ, అవిద్ధుడనే ముసలి మంత్రీ ఎంతగానో

చెప్పారు, నిన్ను విడిచిపుచ్చుమని అన్నారు. కాని రావణుడు వారి మాటలు వినక, తాను జీవించి ఉండగా నిన్ను విడవనని మంత్రులతో ఆలోచన చేస్తున్నాడు. ఇక అతనికి చావు తప్పదు," అన్నది.

ఈ సమయంలో వానరసేనలు చేసే సింహనాదాలు దగ్గరలో, భయంకరంగా వినవచ్చాయి. ఆ ధ్వనులు విని రాక్షసులు తెల్లబోయారు. రావణుడి సభలోని వారు కూడా వాటిని విన్నారు.

"రాముడు సముద్రం దాటి రావటమూ, అతని బల పరాక్రమాలూ విని మీరంతా దిగాలుపడి పోవటం నేను గ్రహించాను," అని రావణుడు సభికులతో అన్నాడు.

అప్పుడు రావణుడి తల్లి తాలూకు బంధువైన మాల్యవంతుడనే వృద్ధ రాక్షసుడు, "రాజా, మన కన్న బలహీనుడితో యుద్ధమూ, బలవంతుడితో సంధీ చెయ్యాలన్నది రాజ నీతి. మన పక్షాన అధర్మం ఉన్నందున మనం బలహీనులంగా ఉన్నాం. అందుచేత మనం రాముడితో సంధి చేసుకుని, సీత నతని కిచ్చివెయ్యటం యుక్తం. మన మధ్య కలహ కారణం సీతే గద. యుద్ధం నీకు కూడా క్షేమం కాదు. అనేక మందిచేత చావు లేకుండా వరం పొందావు



గాని, ఇప్పుడు మన పైకి ఎత్తి వచ్చిన మనుష్యులూ, వానరులూ, కొండముచ్చులూ, ఎలుగుగొడ్డులూ మొదలైన వారిచేత చావు లేకుండా వరం పొంది ఉండలేదు. శకునాలేవీ బాగాలేవు," అన్నాడు.

ఈ సలహా విని మండిపడి రావణుడు మాల్యవంతుడితో, "కోతులను వెంటబెట్టుకుని వచ్చిన రాముడు రాక్షస బలాలు గల నాకంటె ఎక్కువ బలం గల వాడని ఏ ఆధారంతో చెప్పావు? బెత్తెడు సముద్రానికి వారధి కట్టగానే రాముడు మహా బలుడయిపోయాడా? పని పెట్టుకుని సీతను తెచ్చుకున్న నేను రాముడికి భయపడిపోయి



ఆమెను తిరిగి ఇచ్చెయ్యనా? ఒక వేళ రాముడు నా కన్న బలవంతుడైతే నా తల నరకనీ, అంతే గాని నే నతనికి లొంగిపోను. అది నా స్వభావానికి వ్యతిరేకం. తిరిగి ప్రాణాలతో వెనక్కెలా పోతామా అని రాముణ్ణి భయపడనీ," అన్నాడు.

ఈ మాటలు విని మాల్యవంతుడు సిగ్గుపడి తల వంచుకున్నాడు. రావణుడు తన మంత్రులతో ఆలోచించి నగర రక్షణ ఏర్పాట్లు చేశాడు. దక్షిణ ద్వారాన మహోదర మహాపార్శ్వ లుంచబడ్డారు. పడమటి ద్వారానికి ఇంద్రజిత్తు నియోగించబడ్డాడు. ఉత్తర ద్వారానికి శుకసారణులతో సహా రావణుడే స్వయంగా వెళ్ళాడు. తూర్పున ప్రహస్తు డుంచబడ్డాడు. విరూపాక్షుడు పట్టణ మధ్య ప్రాంతంలో అనేకమంది రాక్షస వీరులతో ఉండిపోయాడు.

లంకానగర రక్షణ గురించి రావణుడు చేసిన ఈ ఏర్పాట్లను విభీషణుడి నలుగురు మంత్రులూ పక్షి రూపాలలో వచ్చి తెలుసుకుని, తిరిగి వెళ్ళి విభీషణుడికి చెప్పారు. విభీషణుడా వివరాలను రాముడికి చెప్పాడు. రాముడు లక్ష్మణ సుగ్రీవులతోనూ, హనుమంత జాంబవంతాది వీరులతోనూ సమాలోచన చేసి, లంకానగరం పైకి ఎలా దాడి చేయవలసినది నిర్ణయించాడు.

నీలుడు కొంత వానరసేనతో తూర్పు ద్వారానికి వెళ్ళి ప్రహస్తుడితో యుద్ధం చెయ్యాలి. అంగదుడు దక్షిణద్వారం వద్ద మహాపార్శ్వ, మహోదరులతో యుద్ధం చెయ్యాలి. హనుమంతుడు పడమటి ద్వారం పైకి పోతాడు. రావణుడు స్వయంగా రక్షించే ఉత్తర ద్వారం మీదికి రామ లక్ష్మణులు వెళ్ళాలని నిశ్చయమయింది. నగర మధ్యం లోని బలాలతో పోరాడవలసిన వారు సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూనూ.

రాముడు పెట్టిన మరొక నియమమేమంటే యుద్ధం చేసేటప్పుడు రామ, లక్ష్మణ,





నీల, అంగద, హనుమంత, సుగ్రీవులూ, విభీషణుడూ తప్ప మరెవరూ నరరూపాలు ధరించరాదు. గుర్తు తెలియగలందులకు వారు వానర రూపాలతోనే ఉండాలి.

ఈవిధంగా నిర్ణయం జరగగానే రాముడు సువేల పర్వతం పైకి దారి తీశాడు. అతని వెంట లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, ఇతర వానర ప్రముఖులూ కొండ ఎక్కసాగారు. వారు సువేల పర్వతం పైకి చేరేసరికి లంకా నగరం ఎదురుగా కనిపించింది. ప్రాకారాల మీదా, ద్వారాల వద్దా నల్లని రాక్షసులు సాయుధులై, యుద్ధసన్నద్ధులై నిలబడి ఉన్నారు. వారిని చూసి వానరులు సింహ నాదాలు చేశారు. ఆ సమయంలో సూర్యు డస్తమించి, పూర్ణచంద్రు డుదయించాడు.

రాముడు మొదలైన వారంతా సువేల పర్వతం పైన ఆ రాత్రి విశ్రాంతి తీసుకున్నారు.

మర్నాడు ఉదయం వానరులు సువేల పర్వతం పైన ఉండే వనాలలో విహరించ బోయారు. రాముడు లక్ష్మణుడితోనూ వానర ప్రముఖులతోనూ సువేల పర్వతం మీది నుంచి త్రికూట పర్వతం మీద నిర్మించి ఉన్న లంకానగరపు శోభను గమనించి ఆశ్చర్యపోయాడు. ఆ నగరంలోని గొప్ప భవనాలూ, ప్రాకారాలూ, గోపురాలూ, రక్షణలూ అతనికి విస్మయం కలిగించాయి.

అతనికి అప్పుడే రావణుడు కూడా కనిపించాడు. అతనికి వింజామరలు వీస్తు న్నారు, శ్వేతచ్ఛత్రం పట్టారు. మనిషి నల్లగా ఉన్నాడు. రక్త చందనం శరీరానికి పూసు కుని వెలలేని రత్నాభరణాలు ధరించి ఉన్నాడు. చాలా బరువైన ఎర్ర జరీ బట్టలు కట్టుకున్నాడు.

అందరితో బాటు రావణుణ్ణి చూస్తున్న సుగ్రీవుడికి ఉన్నట్టుండి పట్టరాని కోపం వచ్చింది. అతను ఒక్క ఊపున సువేల పర్వత శిఖరం నుంచి రావణుడున్న గోపురం





67



మీదికి దూకి, రావణుడికేసి తీక్ష్ణంగా చూసి, గాలిలోకి ఎగిరి రావణుడి కిరీటాన్ని తన్ని మళ్ళీ నేలపై వాలాడు. రావణుడు కోపంతో లేచి సుగ్రీవుణ్ణి తన చేతులతో పడదోశాడు. సుగ్రీవుడు బంతిలాగా పైకి లేచి రావణుణ్ణి పడదోశాడు. ఇద్దరూ కలియబడి చాలాసేపు భయంకరంగా కొట్టుకున్నారు. చివరకు రావణుడు అలిసి మాయాయుద్ధానికి దిగుదా మనుకుంటూండగా, ఆ సంగతి గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను మళ్ళీ వస్తాడని రావణుడనుకున్నాడు గాని, సుగ్రీవుడు తిరిగి రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, "సుగ్రీవుడా, నీవు రాజువై ఉండి, ఇలాటి అపాయకరమైన పని తొందరపాటున చెయ్యగూడదు. మేమందరమూ చాలా కలత పడ్డాం. నీకు అపాయం జరిగి ఉంటే మా అందరి పనీ ఏమై ఉండేది?" అన్నాడు.

"నీ భార్య నెత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు ఎదురుగా కనిపిస్తూంటే సహించ లేక పోయాను," అన్నాడు సుగ్రీవుడు.

అప్పటికప్పుడే అందరూ సువేల పర్వతం దిగి, వానరబలాలతో సహా త్రికూట పర్వతం ఎక్కారు. చూస్తుండగానే వానరులు లంకా నగరాన్ని ముట్టడించారు. రాముడు నిర్దేశించిన ప్రకారం ఏ ద్వారం వద్ద యుద్ధం చెయ్యవలసిన వానరయోధు లా ద్వారం వద్ద నిలబడ్డారు.

అప్పుడు రాముడు అంగదుణ్ణి పిలిచి, "అంగదుడా, నీవు నిర్భయంగా లంకా ప్రాకారం దాటి, రావణుడుండే చోటికి వెళ్ళి, నా మాటలుగా ఇలా చెప్పు: రావణుడా, నా భార్యను అపహరించిన నిన్ను శిక్షించటానికి యముడులాగా నేను వచ్చాను. ఏ బలం చూసుకుని నన్ను మోసపుచ్చి సీతను ఎత్తుకు పోయావో ఆ బలాన్ని ఇప్పుడు చూపించు. నీవు సీతను తెచ్చి

నాకు సమర్పించి నా శరణు వేడని పక్షంలో నిన్నూ, నీ రాక్షస కులాన్నీ నాశనం చేసి, లంకకు విభీషణుణ్ణి రాజుగా చేస్తాను. మూర్ఖులను ఆశ్రయించి ఉన్న నీకు రాజ్యార్హత పోయింది. నన్ను శరణువేడని పక్షంలో నాతో యుద్ధానికి వచ్చి, నా చేత చచ్చి పవిత్రుడివికా!" అన్నాడు.

అంగదు డీ సందేశం పుచ్చుకుని ఆకాశం లోకి ఎగిరి లంకలో వాలి, రావణుడు తన ఇంట మంత్రులతో కూర్చుని మాట్లాడుతున్న చోటికి వెళ్ళి, రావణుడి పక్కన నిలబడ్డాడు. అతను రావణుడికి తానెవరో చెప్పుకుని, రాముడు చెప్పమన్న మాటలు, ఒక్క ముక్క పొర్లు పోకుండా, రావణుడికి వినిపించాడు.

ఆ మాటలు వినేసరికి రావణుడు కోపం పట్టలేక, "ఈ అంగదుణ్ణి చంపెయ్యండి," అని మళ్ళీ మళ్ళీ కేకలు పెట్టాడు. నలుగురు రాక్షసులు అతన్ని పట్టుకుందామని వచ్చారు. అంగదుడు వారిని దగ్గరదాకా రానిచ్చి, వారిని తన చంకల్లో ఇరికించుకుని, ఒక్క ఎగురున రావణుడి ఇంటి ప్రాకారం మీదికి వెళ్ళి వాలాడు. కొండంత ఎత్తున్న ఆ ప్రాకారం మీద అతను వాలేటప్పుడు రాక్షసులు కింద పడిపోయారు.

ఆ ప్రాకారం మీద ఉన్న గోపురం అంగదుడి కంట పడింది. అంగదుడా గోపురాన్ని కాలితో ఒక్క తన్ను తన్నేసరికి అది విరిగి పడిపోయింది. అంగదుడు తన పేరు అందరికీ వినబడేటట్టు గట్టిగా చెప్పుకుని, ఎగిరి వెళ్ళి రాముడి చెంత వాలాడు.

ఇంతలో కొందరు రాక్షసులు వచ్చి, లంకను వానరసేనలు ముట్టడించిన సంగతి రావణుడికి చెప్పారు. రావణుడు ఆగ్రహావేశుడై తన నగరాన్ని ముట్టడించిన వానరులను చూడటానికై ప్రాసాదం మీదికి వచ్చాడు. వానరులు భూమినంతా ఆక్రమించి ఉండటం చూసి అతను ఆశ్చర్యపోయాడు.






# ధ్రువచరిత్ర

## 2

అనంతరం విష్ణువు గరుడ వాహనారూఢుడై మధు వనానికి వెళ్ళాడు. ధ్రువు డాయనను చూస్తూనే సాష్టాంగ ప్రమాణం చేశాడు, పరమానందం పొందాడు, కాని పసివాడు కావటంచేత విష్ణువును ఎలా స్తోత్రం చెయ్యాలో తెలియక తికమక పడ్డాడు. అది చూసి విష్ణువు ధ్రువుణ్ణి తన శంఖంతో నుదుటి మీద తాకాడు. దానితో ధ్రువుడికి వాక్శుద్ధి కలిగి, అతను విష్ణువును స్తుతించాడు.

ధ్రువుడి తపస్సుకు మెచ్చి అతనికి ప్రత్యక్షమైన విష్ణువు ధ్రువుడికి రాజ్య ప్రాప్తి కలిగేటట్టూ, అతను ఇరవై ఆరువేల సంవత్సరాలు నిష్కంటకంగా పాలించి, సమస్త ఐహిక భోగాలూ అనుభవించి, అనంతరం మూడు లోకాలకూ మీదుగా ఒక స్థిర స్థానంలో ఉండేటట్టూ, నక్షత్ర రూపులై ఉన్న దేవతలందరూ అతనికి ప్రదక్షిణం చేసేటట్టూ వరం ప్రసాదించి, గరుడ వాహనుడై వెళ్ళిపోయాడు.

ఈ విధంగా తన కోరిక నెరవేర్చుకుని ధ్రువుడు తన నగరానికి బయలుదేరాడు. ఈ వార్త తెలిసి ఉత్తానపాదుడు, చచ్చిపోయినవాడు తిరిగి వచ్చినట్టుగా ఆనందించి, వార్త తెచ్చిన వాడికి అంతులేని ధనం కానుకగా ఇచ్చి, బంగారు రథమెక్కి, పరివారంతోనూ, మంగళ వాద్యాలతోనూ, బ్రాహ్మణాశీర్వాదాలతోనూ బయలుదేరాడు. అతని భార్యలైన సునీతి, సురుచీ, బంగారు పల్లకీలలో ఎక్కి ఉత్తముడితో సహా రాజు వెంట వెళ్ళారు.

పురం దాటగానే ఉద్యానవన ప్రాంతంలో ధ్రువు డెదురయాడు. వెంటనే ఉత్తానపాదుడు రథం దిగి, తన కొడుకును కౌగ

అట్ట చివరి బొమ్మ



లించుకుని, ఆనందాశ్రువులతో అతన్ని తడిపేశాడు.

ధ్రువుడు తన తండ్రికీ, తల్లు లిద్దరికీ ప్రణామాలు చేశాడు. సురుచి సవతి తల్లి అయి ఉండికూడా అతన్ని ఆలింగనం చేసుకుని, గద్గద కంఠంతో ఆశీర్వదించింది.

ధ్రువుణ్ణి ఏనుగు పైన కూర్చోబెట్టి నగరంలోకి తీసుకు వచ్చారు. మకర తోరణాలతోనూ, మామిడాకుల తోరణాలతోనూ, పూల తోరణాలతోనూ, అరటి చెట్లతోనూ, పూర్ణ కుంభాలతోనూ, బలి దీపాలతోనూ నగరమంతా అలంకరించబడి కళకళ లాడుతున్నది. ధ్రువుడికి అక్షింతలూ, పుష్పాలూ, ఫలాలూ, కర్పూర నీరాజనాలూ ఇచ్చారు, ఆశీర్వాదాలు చెప్పారు. అతను రాజ భోగాలనుభవిస్తూ, తన తండ్రి ఇంటనే ఉండ నారంభించాడు.

కాలం గడిచింది. ఉత్తానపాదుడు వృద్ధుడయాడు. ధ్రువుడికి యుక్త వయసు వచ్చింది. ప్రజలకు అతని పైనా, అతనికి ప్రజల పైనా చాలా ప్రేమ. ఇది గమనించి ఉత్తానపాదుడు ధ్రువుడికి రాజ్యాభిషేకం చేసి తాను వనవాసం వెళ్ళిపోయాడు.

ధ్రువుడు శింశుమారుడనే రాజుయొక్క కూతురు భ్రమి అనే దాన్ని, ఇల అనే మరొకతెనూ పెళ్ళాడాడు. భ్రమికి కల్పుడూ, వత్సరుడూ అని ఇద్దరు కొడుకులు కలిగారు; ఇలకు ఉత్కలుడనే కొడుకూ, ఒక కూతురూ పుట్టారు.

ఉత్తముడు పెళ్ళి కాకపూర్వమే హిమాలయానికి వేటకు వెళ్ళగా అక్కడ ఒక యక్షుడతన్ని చంపాడు. అతని తల్లి సురుచి కూడా చనిపోయింది.

తన తమ్ముణ్ణి చంపినందుకు యక్షులపై అలిగి ధ్రువుడు అలకాపురం పైకి దండెత్తి వెళ్ళి శంఖం పూరించాడు. వెంటనే సాయుధులైన గుహ్యకులు నగరం నుంచి బయటికి వచ్చి ధ్రువుడితో యుద్ధానికి తల

పడ్డారు. వాళ్ళు అతనిపై తమ ఆయుధాలు వర్షంలాగా కురిపించినా ధ్రువుడు లక్ష్య పెట్టక అందరినీ బాణాలతో కొట్టాడు. ఒక్కడు కూడా మిగలకుండా అందరూ మాయమయారు.

అది చూసి ధ్రువుడు అలకానగరం ప్రవేశించి నగర మంతా చూసి ఆనందిం చుదా మనుకుంటుండగా సముద్ర ఘోష లాటి ధ్వని ఒకటి బయలుదేరింది. క్షణంలో ఆకాశం మబ్బులు కమ్మి, ఉరుములూ, మెరుపులూ సాగాయి. అన్ని దిక్కులా దుమ్ము లేచింది. రక్తం వర్షంలాగా కురవ సాగింది. దానితోబాటు మొండాలూ, ఆయుధాలూ పడ్డాయి. ఆకాశాన కొండలాటిది కనిపించింది. రాళ్ళు కురిశాయి.

ఇదంతా శత్రువుల మాయాజాలమని తెలుసుకుని ధ్రువుడు నారాయణాస్త్రం పఠించాడు. వెంటనే మాయ విచ్చిపోయింది. ధ్రువుడు పారి పోతున్న గుహ్యకులను వెన్నంటి చిత్రవధ చేశాడు.

అప్పుడు, ధ్రువుడి తాత అయిన స్వాయంభువమనువు అతని దగ్గిరికి వచ్చి, "నాయనా, పాపహేతువైన రోషం విడిచిపుచ్చు. దాని మూలానే గదా నిరపరాధులైన గుహ్యకులను చంపావు. నీ తమ్ముణ్ణి చంపినవాడు ఒక్కడే, కాని నీవు అనేకమందిని చంపావు. మన



వంశానికి చేటు తెచ్చుకోక కుబేరుణ్ణి మంచి చేసుకో," అని హితం చెప్పాడు.

ఈ వార్త తెలిసి కుబేరుడు యక్ష కిన్నర చారణ పరివారసమేతుడై ధ్రువుడి వద్దకు వచ్చాడు. ధ్రువు డాయనకు నమస్కరించాడు. కుబేరు డతనితో, "నీవు కోపం విడిచి పెట్టావు, చాలా సంతోషం. వాళ్ళు నీ తమ్ముణ్ణి చంపటం తప్పే. కాని ఇలాటివి కాలానికి కట్టుబడి జరుగుతాయి. క్షేమంగా వెళ్ళిరా!" అన్నాడు.

ఈ విధంగా కుబేరుడి స్నేహం సంపాదించి ధ్రువుడు తన నగరానికి తిరిగి వచ్చి, ఇరవై ఆరువేల ఏళ్ళు రాజ్యం చేసి, రాజ్యత్యాగం చేసి, బదరికాశ్రమానికి వెళ్ళాడు. అతను మందాకినీ తీర్థంలో స్నానం చేసి, యోగ సమాధిలో కూర్చునుండగా, ఆకాశం నుంచి వెలిగిపోతూ ఒక దివ్య విమానం దిగి వచ్చింది. అందులో నాలుగేసి చేతులూ, నీల శరీరాలూ, కిరీట కుండల కేయూరాది ఆభరణాలూ గల విష్ణు దూత లిద్దరున్నారు. వారు సునందుడూ, నందుడూ అనేవారు.

ధ్రువుడు వారికి ప్రణామం చేశాడు. వారతనితో, "అయిదవ ఏటనే నీవు ప్రత్యక్షం చేసుకున్న విష్ణువు నీ కోసం విమానం పంపాడు. సప్తర్షులకూ, నీ పూర్వీకు లెవ్వరికీ లభ్యంగాని స్థానం నీకు లభించ నున్నది. అక్కడి నుండి చూస్తే సూర్య చంద్ర గ్రహ నక్షత్ర తారాగణాల ప్రదక్షిణం నీకు కనిపిస్తుంది," అన్నారు.

ధ్రువు డీ మాటలకు సంతోషించి విమానంలో ఎక్కబోతూ, "నా తల్లిని యిక్కడ విడిచి నేను పుణ్య లోకాలకు ఎలా వెళ్ళను?" అనుకున్నాడు.

అప్పుడు విష్ణు దూత లతనికి మరొక దివ్య విమానంలో స్వర్గానికి వెళుతున్న సునీతిని చూపారు. అతను తృప్తిపడి విమానం ఎక్కి, జ్యోతిశ్చక్రానికి ఇరుసు లాటిదైన ధ్రువ మండలానికి వెళ్ళిపోయాడు.



# 35. కాంచనజంగ

నేపాలుకూ, సికిమ్ కూ మధ్య సరిహద్దు పై గల కాంచనజంగ శిఖరాన్ని సికిమ్ ప్రజలు "దేవనివాసం" అంటారు. ఎవరెస్టు, కె-2 శిఖరాల తరవాత ప్రపంచంలో కెల్లా ఎత్తయిన శిఖర మిదే (28,086 అడుగులు). 1955 లో ఒక బ్రిటిషు దళంవారు, దీనిని ఎక్కినప్పుడు, సికిమ్ మహారాజు కోరికపై, దళసభ్యులు దీని శిఖరం మీద అడుగు పెట్టక, దానికి అయిదడుగులు దిగువ వరకూ ఎక్కి దిగి వచ్చారు.



Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

మహాత్ముని సాధనం

పంపినవారు :
యస్. రామమూర్తి, చెన్నూరు

Photo by Prasad




బహుమతి
పొందిన వ్యాఖ్య

మహిమకలది కాదనం

పంపినవారు :
యస్. రామమూర్తి, చెన్నూరు

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మహాత్ముని సాధనం

రెండవ ఫోటో : మహిమకలది కాదనం

పంపినవారు : యస్. రామమూర్తి,

చెన్నూరు (కడప జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI

ASP/GM/K-7L TEL

# ఆహా... కోలినాస్

Kolynos

## హాయినిగొలిపే స్వచ్ఛమైనది...

కోలినోస రుచి!
నాలుక ఝల్లుమనే ఆహ్లాదం
కోలినోస్ నురుగు!
తోముకొనుట తేలికచేయును, పూర్తిగా శుభ్రపరచును
కోలినోస యిచ్చే సుగంధ శ్వాస!
మీకు, యితరులకు ఎంతో యిష్టం

ఆ ఐదో ఆయనకు ఒక్క కిటుకు!
కోలినోస డెంటల్ క్రీమ్ వాడి, ఒక్కసారి
చిరునవ్వు...అందరిలాగే! కోలినోసతో
శుభ్రంగా, హాయిగా వుండండి — ఉదయము,
రాత్రి. ఈ సహవాసంలో అధిక
విశ్వాసము...అధిక ఉల్లాసము.



## మధురమైన చిరునవ్వులు..., కోలినోస్ చిరునవ్వులు

రిజిష్టర్డ్ యూజర్: జెఫ్రీమేనర్స్ అండ్ కంపెనీ లి.




వెండితెర నవల వెల 60 పైసాలు. విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-4.

# దిలీపు బృందం

## దాగుడుమూతలాట






























JWTUC1738

87

